ఫిబ్రవరి 1985
సంపుటి 1
సంచిక 2

# శ్రీవాణి

సాంస్కృతిక మాసపత్రిక
సంపాదకుడు: కొమరగిరి కృష్ణమోహనరావు

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-51 రామానాయుడుపేట
మచిలీపట్నం-521001

చందా వివరాలు
విడిప్రతి : రు. 2-50
సంవత్సర చందా : రు. 27-00
జీవిత సభ్యత్వం : రు 500-00

EDITED, PRINTED & PUBLISHED BY
**Komaragiri Krishna Mohan Rao**

Printed at
BRUNDAVAN PRINTERS
Bhaskarapuram
MACHILIPATNAM

on behalf of
Triveni Publishers Pvt. Ltd.
Buttaiahpet Machilipatnam

విషయసూచిక

# సంపాదకీయం

ఎనిమిదవ లోక్‌సభ ఎన్నికలు అత్యంత ఆశ్చర్యాన్ని కలుగజేసాయి. స్వార్థం, అహంకారం, మొండిపట్టుదల, అహంభావాలతో ఒకే సీటులో తారసిల్లిన ప్రతిపక్షాలు ఓటర్లు చక్కటి గుణపాఠం నేర్పారు. అనుభవం వున్నా లేకపోయినా రాజీవ్ గాంధీ, ఎన్.టి.ఆర్. లను అదృష్టదేవత వరించింది. దేశంకోసం తనసర్వస్వాన్ని సమర్పించిన పండిత నెహ్రూకన్నా ఎక్కువ మెజారిటీని సంపాదించిన ఘనత 'రాజీవ్'కు దక్కింది. కాకలుతీరిన యోధుల నేతృత్వంలో ఎన్నికలరంగంలోదిగిన ప్రతిపక్షాలు పరాజయాన్ని చవిచూచినసమయంలో, మనరాష్ట్రంలో విజయదుందుభులను మ్రోగించిన ఘనత 'ఎన్. టి. ఆర్.'కు దక్కింది. ఒకరు భారతదేశంలో ప్రతిపక్షాలను చిత్తుచేసిన ధీరుడుగాను, మరొకరు ఆంధ్రప్రదేశ్‌లో కాంగ్రెసుని చిత్తుచేసినవీరుడుగాను నేడు భారతప్రజల దృష్టిలో రాజీవ్, ఎన్. టి. ఆర్. లు నిలిచారు. ఒక ప్రాంతీయపార్టీని భారత లోక్‌సభలో ప్రతిపక్షస్థానంలో నిలిపిన ఘనత తెలుగువారికిమాత్రమే దక్కింది. అనుభవజ్ఞులైన నాయకులతో బలమైన ప్రతిపక్షం నేడు లోక్‌సభలో లేకుండాపోయింది: ఇది నిజంగా దురదృష్టకరం. ప్రజాస్వామ్య మనుగడకే తీరని నష్టం. ఈ దురదృష్ట పరిస్థితికి ప్రజలుమాత్రం బాధ్యులు కారు. దీనికి ప్రతిపక్షములే బాధ్యులు. రాజీవ్, ఎన్. టి. ఆర్. లు ఊహించని రీతిలో ప్రజలు వారికి అత్యధిక మెజారిటీని అందించారు. దానిని సద్వినియోగపరచుకోవలసిన గురుతర బాధ్యత వారిద్దరిమీదా వున్నది. హెచ్చరించే ప్రతిపక్షం లేదనే ధీమాతో నడుస్తే ఒకరు దేశానికి, మరొకరు రాష్ట్రానికి మేలుకన్నా హానినే చేసినవారవుతారు. ఈ విజయం నా ప్రతిభవలననే చేకూరిందని వారిరువురిలో ఎవరైనా భావిస్తే అది పొరపాటే అవుతుంది. దేశానికి మేలుకన్నా కీడే ఎక్కువజరిగే ప్రమాదమున్నది.

> " The greatness of a man lies not in doing great things in a great way,
> But in doing small things in a great way "

"మనుజుని యొక్క గొప్పతనము పెద్దపెద్ద కార్యములను ఆర్భాటముగ చేయుటలో లేదు. చిన్నచిన్న కార్యములను గొప్పమనసుతో చేయుటలోనే కలదు." అనేలోకోక్తిని వీరిరువురు నేతలు సార్థకం చేస్తారని ఆశిద్దాం.

ప్రస్తుతపరిస్థితులలో ప్రతిపక్షాలు ఎంతో సహనాన్ని ప్రదర్శించాలి. ఓడిపోవడానికి గల కారణాలను విమర్శించుకోవాలి. చేసిన పొరపాట్లను విశాలభావంతో సరిదిద్దుకోవాలి. చౌకబారు విమర్శనలకు తావివ్వరాదు. హుందాతనంగా వ్యవహరించాలి. నిర్మాణాత్మక కార్యక్రమాలను చేబట్టి ప్రజలముందుకువెళ్ళి వారి మెప్పును తిరిగిపొందడానికి కృషిచేయాలి. అదిచేయకుండా కక్ష సాధించడానికి ప్రయత్నిస్తే మిగిలిన ప్రతిష్టకూడా గంగపాలు కావచ్చు. ఈ ఎన్నికలు ఓడిపోయిన ప్రతిపక్షములకు ఒక చక్కటి గుణపాఠం. అదృష్టదేవత వరించిన నేతలకు ఇదిఒకముళ్ళకిరీటం. ఇరుపక్షములు సహనంతో, దూరదృష్టితో విజ్ఞతను ప్రదర్శించుతారని ఆశిద్దాం. రాబోవు శాసనసభ ఎన్నికల ఫలితాలు వీరనుసరించే విధానాలమీద ఆధారపడివుంటాయి.

# ఆంధ్ర సంస్కృతికి రాజధాని బందరు

## శ్రీవాణి

వంలో

## ప్రముఖుల ప్రశంసలు

ఆంధ్ర ప్రదేశ్ రాజకీయ రాజధానులు ఎన్నోమార్పులు జరిగినా. ఆంధ్ర సంస్కృతికి మాత్రం రాజధాని' బందరు'అని చరిత్ర చాటుతున్నది. ఆ బందరు నుండే 'శ్రీవాణి' ని ఆత్మబలంతో శ్రీకొమరగిరి తేవటం మరింత శుభ సూచకం— శ్రీకొమరగిరి చేపట్టిన ఈసాహసం ప్రశంసనీయంగా వుంది. అని 'శ్రీవాణి' సాంస్కృతిక మాసపత్రిక ఆవిష్కరణ మహోత్సవ సభలో సుప్రసిద్ధ సాహిత్య నవలా రచయిత డా. ముదిగొండ శివప్రసాద్ పేర్కొన్నారు.

ఇక్కడ ముట్నూరి కృష్ణరాయ పురమందిర ఆవరణంలో 1984 డిశంబరు 9వ తేదీ సాయంత్రం ప్రత్యేకంగా, అతి సుందరంగా, రమణీయంగా, వైభవంగా ఏర్పాటైన సభావేదిక మీద రాష్ట్రప్రభుత్వ సమాచార—సాంస్కృతిక శాఖల కమీషనర్ శ్రీ పి.వి.ఆర్.కె. ప్రసాద్ I.A.S శ్రీవాణి ప్రథమ సంచికను నిర్ణీత ముహూర్తానికి ఆవిష్కరించారు.



శ్రీ శివప్రసాద్ తమ ప్రసంగం కొనసాగిస్తూ ఆదర్శం కోసం సాహిత్య—సాంస్కృతిక పత్రికలున్నా ఎందరికి వీటిని గురించి తెలుసు? ఆ పత్రికలు అందుబాటులో వుండాలి—దానితోపాటు వ్యాపారార్థం నడిపేటప్పుడు—ప్రతికానిర్వాహకులు మార్పులు తేవటం జరుగుతుంటుంది. వారికి లాభార్జన ధ్యేయం అయి పత్రికలు అనారోగ్య పరిస్థితుల్లో తయారవుతున్నాయి.'' అన్నారు.

''పత్రికల్లో వ్యాసాలు లక్షలాది కుటుంబాల మీద ప్రభావితం అయి వార్కి మానసిక పక్షపాతం తెస్తాయి. ఇదివిషపూరితమైన కాలుష్యంకంటే ప్రమాదం తెస్తాయి—ఉపకారం కంటే అపకారమే కలిగిస్తాయి. సమాజసేవకు పత్రికలు ఉపయోగపడాలంటే ఆర్థికంగా నష్టపోవాల్సిందిగా నేను చెప్పను. సామాన్యుని నుండి మేధావంతులవరకు ఆకర్షించేరీతిలో మొత్తం కుటుంబాలను ఆకట్టుకునే పద్ధతిలో పత్రికలుండాలని మాత్రం నేను కోరుతాను.'' ''పత్రికలు, రేడియో, టి.వి. ల్లో తెలుగు భాషలో మార్పు చేస్తున్నారు -పాటకులు (పాఠకులు) మవునము (మౌనము) అని తమ సౌకర్యార్థం—పత్రికలు అచ్చు వేస్తున్నాయి కనీసం భాషను పత్రికలు కాపాడాలి'' అని శ్రీముదిగొండ అన్నారు. 'శ్రీవాణి' సంపాదకులు శ్రీకొమరగిరి అన్ని తరగతుల వారిని ఆకట్టుకునే రీతిలో పత్రిక నిర్వహించ గలరన్న ఆశాభావం శ్రీ ముదిగొండ వ్యక్తంచేసారు.



పత్రికావిష్కరణ చేస్తూ సమాచార శాఖ కమీషనర్ శ్రీ.పి.వి.ఆర్.కె.ప్రసాద్ ప్రసంగిస్తూ మహా విద్వాంసులు, పండితులు, కవులు భక్తులు, రచయితలు, రచయిత్రులు వున్న ఈ వేదికమీద ప్రసంగించడం సాహసమే అవుతోంది. అధికారిగా నాకు పరిమితులున్నాయి. ఉన్నత భావాలు, ఉదారత, ఆశయాలతో 'శ్రీవాణి' పత్రికను శ్రీకొమరగిరి తేబూనటం ఎంతైనా నాకు ఆనందం కలిగిస్తున్నది. సమాజ పరిస్థితులవల్ల కొన్ని మార్పులు అనివార్యమని సంపాదకులు చెప్పారు. నిజం అంతే. సాంస్కృతిక పత్రికగా ఎంతకాలం నిర్వహించ గలమా ? అనేది నిర్వాహకులు పరిశీలించుకోవాలి. ఈ పత్రిక పట్ల ప్రజలకున్న నమ్మకాన్ని శ్రీకొమరగిరి తీర్చగలరన్న ఆశాభావం వుంది. అయితే ఉన్నతస్థాయిలో నడపడం అంత తేలికైన విషయం మాత్రం కాదు. యివన్నీ శ్రీకొమరగిరి ముందుగానే పరిశీలించి—పరిగణలోకి తీసుకున్నామని ఆయన చెప్పుకోవడం— వారిసాహసాన్ని వెల్లడిస్తుంది. సమాజాన్ని ఉత్తేజపరిచేది పత్రిక—సమాజంలో సముచిత స్థానం సంపాదించుకునేందుకు సంపాదకులు కృషి చేస్తారని ఆశిస్తున్నాను.

'' చిన్న మాస పత్రికలు ఆగకుండా, ఎల్లోజర్నల్గా కుండా మంచి ఆశయాలతో నడిపే, చిన్న పత్రికలకు ప్రభుత్వం తోడ్పడేందుకు పథకంవుంది. వివిధ రంగాలలోని పత్రికలకు కూడా ప్రభుత్వంద్వారా సహాయం వుంటుంది. ఆవిధమైన పథకం క్రింద ఎంతవీలుంటేఅంత సహాయం అంద జేయగలము'' అని సమాచార శాఖ కమీషనర్ శ్రీ ప్రసాద్ వివరించారు.

సభకు హిందూ కళాశాల పాలకవర్గం కార్యదర్శి శ్రీ దైత మధుసూదన శాస్త్రి అధ్యక్షత వహించారు.

ముఖ్య అతిథిగా హాజరైన డా. దివాకర్లవెంకటావధాని ప్రసంగిస్తూ ''భారతీయ సంస్కృతికి సరైన చిహ్నాలు భారత, భాగవత రామాయణాలే, అయితే కొంతవరకు యువతరం దీనిని విస్మరించారు. ప్రాచీన గ్రంథాల లోని

విషయాలను ఈ నూతన పత్రికలో ముద్రించి నేటి తరం తెలుగు ప్రజలకు నిర్వాహకులు అంద జేయాలి. 'భాష' దేశకాల పరిస్థితులను బట్టిమారు తుంది. యిది సహజం. అయితే కావ్యాన్ని కావ్యంగా అసలు భావాలకు భంగం లేకుండా చూడటం చాలా అవసరం. నిర్వాహకులు యిందుకు ప్రయత్నించాలి. పూర్వ సంస్కృతి, నాగరికత భాషను పునరుద్ధరించాల్సిన అవసరం ఎంతో వుంది రచనలు చేసేవారు భాషప్రభావాన్ని, విసిష్ఠతను కాపాడాలి. ఈ 'శ్రీవాణి' పత్రిక ముచ్చటగా వుంది. 'శ్రీవాణి' అనే, పదం — ప్రాచీన పూర్వీకులు — తమ తమ గ్రంథాల్లో

ఆనాడు 'కృష్ణాపత్రిక' వెలువడింది. ఆ వరవడిలోనే నిర్వహించేందుకు కృతనిశ్చయానికి వచ్చి ఈ 'శ్రీవాణి' ని ప్రారంభించడం జరిగింది. 'శ్రీవాణి' ని సమగ్ర విజ్ఞాన వాణిగా రూపొందించాలని నా ఆకాంక్ష. సాంస్కృతిక, సాహిత్య, ఆధ్యాత్మిక, రాజకీయ, ఆర్థిక, విద్యావ్యాసాలు బాల, యువ, మహిళా శీర్షికలు; సీరియల్స్ కథలు, కవితలు కార్టూన్స్‌లతో అన్ని అభిరుచులవారికి 'శ్రీవాణి' అందించాలని నిర్ణయించుకున్నాను. అయితే స్థలాభావం వలన అన్ని వ్యాసాలు ప్రారంభ సంచికలో అందించలేకపోయా. నా నిర్ణయానికి సర్వవిధాల సహకారం అందించిన శ్రేయో



మొదటి పద్యంలో ప్రారంభించారు. సంపాదకులు ఈ పేరు ఎంపిక చేయడం సముచితంగా వుంది. శ్రీ కొమరగిరి సంపాదకులుగా ఒక విశిష్టస్థానం సంపాదించుకో గలరని ఆశిద్దాం" అని డా. దివాకర్ల పేర్కొన్నారు.

పత్రికను సభకు పరిచయంచేస్తూ సంపాదకులు శ్రీ కొమరగిరి — తమ ప్రసంగంలో "సాహితీ సాంస్కృతిక రంగంలో ప్రత్యేకస్థానం సృష్టించుకున్న బందరులో

భిలాషులందరికి నా కృతజ్ఞతలు" అన్నారు.

ప్రముఖ జర్నలిస్టు, ఆంధ్రజ్యోతి ఉప సంపాదకులు, శ్రీ తుర్లపాటి కుటుంబరావు తన ప్రసంగంలో "పత్రికలు నడపడం అంత తేలిక కాదు. అందులో ఉన్నతభావాల పత్రికలకు ఆదరణ లభించటం బహుకష్టం. అయితే 'శ్రీవాణి' సంపాదకులు శ్రీ కొమరగిరికి అన్నిరంగాలలో పరిచయం వున్నది. ఆయన ప్రజామనిషి. కనుక ఆయన

ప్రారంభించిన ఈ పత్రికకు సహకారం వుంటుందనడానికి ఈ ఆవిష్కరణ మహోత్సవమే నిదర్శనం. ఆనాటి కృష్ణా పత్రిక సంపాదకులు కృష్ణారావు. ఈనాటి శ్రీవాణి సంపాదకులు కృష్ణమోహనరావు. సారూప్యత వున్నది. కృష్ణాపత్రికకు వచ్చినకీర్తి ప్రతిష్ఠలు ఈ శ్రీ వాణికి కూడా లభ్యమవుతాయనే నమ్మకం నాకున్నది. అయితే ఎట్టిమోహ మాటాలకు తావివ్వకుండా, నిషృక్షపాతమైన సద్విమర్శన లతో, హుందాతనంగా, ఉన్నతస్థాయిలో పత్రికనునడపాలని కోరుతున్నాను" అని శ్రీ తుర్లపాటి ప్రసంగాన్ని ముగించారు.

మంది స్త్రీలు పాల్గొనడం, గంటల తరబడి ఓపికగా సాహితీ ప్రసంగాలను వినడం అపూర్వం. మిత్రుడు, ఆత్మీయుడు, అనేక పోరాటాలలో నాతో భుజంకలిపి పని చేస్తున్న కొమరగిరి కడు సమర్థుడు. సంస్కారంగల వ్యక్తి. పట్టుదల గలవాడు. అతని సంపాదకత్వాన 'శ్రీవాణి' ప్రజావాణిగా పేరు ప్రతిష్ఠల నందు కొంటుందని నా విశ్వాసం " అన్నారు.

'త్రివేణి' సంపాదకులు శ్రీ భావరాజు నరసింహారావు తమ ప్రసంగంలో పత్రికా నిర్వహణలో ఎదుర్కొంటున్న యిబ్బందులను వివరిస్తూ 'కొమరగిరి' సాహసాన్ని




కృష్ణా జిల్లా పరిషత్ ఛైర్మన్, బహుముఖ ప్రజ్ఞాశాలి శ్రీసుంకర సత్యనారాయణ తమ ప్రసంగంలో ఈనాడు నిజంగా నా జీవితం ధన్యమైంది. కలుషిత రాజకీయ వాతావరణంలో. మునిగి తేలుతూ అహోరాత్రాలు తిరుగుతున్న నాకు ఈ ప్రశాంత వాతావరణం ముగ్ధుణ్ణి చేసింది. ప్రస్తుతంవున్న ఎన్నికల వేడిలో ఒక సాహితీ సభకు రెండు వేలమంది రావడం, అందులో వందలాది

ప్రశంసించారు. 'శ్రీవాణి'మాసపత్రిక కేవలం సాంస్కృతిక పత్రికగా గాక వివిధ రంగాల విషయాలలో కూడా ప్రాధాన్యత సంతరించు కుంటుందని—'శ్రీవాణి' రజతోత్సవం జరిపించుకొని తీరుతుందన్న ఆశాభావం—శ్రీభావ రాజు వారు వ్యక్తం చేసారు.

సర్వశ్రీ ముసునూరి జగన్నాధరావు, 'కవిశేఖర' శ్రీ గురుజాడ రాఘవశర్మ, 'అభినవ రామకృష్ణ' శ్రీఅద్దేపల్లి



# అందరికీ నమస్కరించి.....

'శ్రీవాణి'ని సమగ్ర విజ్ఞాన వాణిగా తీర్చి దిద్దాలనే పరమావధితో ఈ పత్రికను ప్రారంభించాను. ప్రారంభ సంచికకు ఊహించని రీతిలో ఆదరణ లభించింది. కర్ణాటక, తమిళనాడు, కేరళ, ఒరిస్సా, మధ్య ప్రదేశ్, యు. పి, ప. బెంగాల్, మహారాష్ట్ర, ఢిల్లీ ప్రాంతాలకు కూడా 'శ్రీ వాణి' చేరుకో గల్గింది.

అనేక మంది పెద్దలు ప్రారంభ సంచికను ప్రశంశిస్తూ లేఖలు వ్రాసారు. శుభాశీస్సులు పంపారు. 'శ్రీ వాణి' ని సర్వాంగ సుందరంగా తీర్చి దిద్దాలనే ఆ కాంక్షతో సద్విమర్శనలు చేసారు కొంతమంది సహృదయులు. వారందరికి నా కృతజ్ఞతలు. ప్రశంశలను, విమర్శనలను దృష్టిలో పెట్టుకొని 'శ్రీవాణి' ని చక్కగా తీర్చిదిద్దడానికి ప్రయత్నిస్తాను.

ప్రారంభ సంచిక కవరు పేజీ అందరిని ఆకర్షించ లేకపోయింది. అందువలన ఈ తడవ ఆఫ్ సెట్ ప్రింటింగ్‌లో కవరు పేజీని తీసుకొని వచ్చాను. 'స్వామి వివేకానంద' ముఖ చిత్రంతో, కవరు పేజీని యింకా ఆకర్షణీయంగా తీసుకొని రావడానికి ఈ తడవ ప్రయత్నించుతాను.

'శ్రీవాణి' సీరియల్స్, కథల పత్రిక మాత్రమే కాదు. సాంస్కృతిక మాస పత్రిక. ఆధునిక, ప్రాచీన సాహిత్యాలకు సముచితమైన స్థానం యివ్వసంకల్పించాను. రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, ఆధ్యాత్మిక, విద్యా వ్యాసములు, సైన్సు సంబంధించిన విజ్ఞాన విశేషాలు, యోగవిద్య, జాతీయ నాయకులు, సంఘ సంస్కర్తలు, కవులు, విప్లవవీరుల చరిత్రలు తరచుగా 'శ్రీవాణి'లో ప్రత్యక్ష మవుతాయి. రామాయణ, భారత, భగవద్గీత సందేశాలకు కూడా సముచితమైన స్థానం యివ్వబడుతుంది. మహిళా, యువ, బాల శీర్షికలు కూడా వుంటాయి. మరియు కథలు, కవితలు, కార్టూన్స్ జోక్స్, పద్యములకు కూడా సముచితమైన ప్రాధాన్యత యివ్వ బడుతుంది. పాఠకుల అభిరుచులను దృష్టిలో పెట్టుకొని త్వరలో మరొక మంచి 'సీరియల్' ను కూడా ప్రారంభించ దలచాను. ఈ రోజులలో యిన్నిరకాల శీర్షికలతో, వ్యాసములతో వెలువడే పత్రికలు తెలుగులో బహు తక్కువగా వున్నాయి. ఇది ఒక మహా ప్రయత్నమే. అయినప్పటికీ సాహసంతో ఈ సవాలును స్వీకరించాను. సర్క్యులేషన్ పెరిగిన కొద్దీ, ఉత్సాహంతో, ప్రజల అభిరుచుల కనుగుణంగా 'శ్రీవాణి' సమగ్ర విజ్ఞానవాణిగా తీర్చిదిద్దడానికి ప్రయత్నించుతాను.

'శ్రీవాణి' ని అభిమానించే పాఠకులు కనీసం ఒక మిత్రునితో సంవత్సర చందా కట్టించే ప్రయత్నం చేస్తారని ఆశిస్తున్నాను. ప్రకటనలు, విరాళములు పంప 'శ్రీవాణి' కి ఆర్థిక స్తోమతను కలుగ చేయమని ప్రార్థిస్తున్నాను. రచయితల సహకారమును అర్థిస్తున్నాను. ఈ సంచికలో స్థలాభావం వలన కొన్ని వ్యాసములు ముద్రించ లేకపోయినాము. అన్యథా భావించకండి.

ప్రారంభ సంచిక అంద లేదని కొందరు ఫిర్యాదు చేసినారు. సంవత్సర చందా దారులందర్కి పత్రిక Post లో పంపడం జరిగింది. ఈ విషయంలో మా కార్యాలయం పొరపాటు ఏ మాత్రం లేదు. అందలేదని వ్రాసిన వారికి మరొక పర్యాయం కూడా పంపించడం జరిగింది. ఈ విషయంలో Postal మిత్రులసహకారం కోసం అర్థిస్తున్నాను. సంచిక అందనివారు. Postal వారికి ఫిర్యాదు చేస్తూ, మా కార్యాలయమునకు కూడా తెలియపరచమని కోరుకుంటున్నాను.

ఈ సంచికలో కూడా అచ్చుతప్పులు కొన్ని దొరలినాయి. ఈతడవ యింకా శ్రద్ధతీసుకొని తప్పులు లేకుండా చేయడానికి ప్రయత్నించుతాను. కథలు, కార్టూన్లకు పారితోషికం యివ్వ సంకల్పించాం. ఉన్నత ప్రమాణాలకు చెందినవి పంపమని కోరుతున్నాను.

సహృదయంతో, సహకారం, సర్వదా అందిస్తారని ఆశిస్తున్నాను.

కొమ్మగిరి కృష్ణమోహనరావు

# అమృతవాణి

## కాచిభట్ల చంద్రశేఖర శర్మ

పురాణమిత్యేవ న సాధు సర్వం
న చాపి కావ్యం నవమిత్యవద్యం
సన్తః పరీక్ష్యాన్యతరద్భజన్తే
మూఢః పరప్రత్యయ నేయబుద్ధిః

ఏవాఙ్మయంలోనైనా కవులు పండితులు తమ ప్రజ్ఞా విశేషాలను ప్రతిభాపాండిత్యాలను ప్రకటించి లోకాన్ని మేలుకొలుపుతారు వాళ్ళ రచనలు ప్రజల మనోబుద్ధుల మీద ప్రభావం చూపిస్తాయి. శబ్దానికున్న శక్తి అలాంటిది. అందులోను కవివాక్కు మరీ పదునైంది. ఏకవివాక్కైనా లోకాన్ని పెడదారి తొక్కించేదైతే అతన్ని కుకవి అంటారు.

దేశకాలాలను గుర్తించి అనంత విజ్ఞానాన్ని ధర్మాన్ని ప్రజోపయోగంగా ప్రబోధించటం పరమలక్ష్యంగా పెట్టుకొని తేటమాటలతో లోకాన్ని కర్తవ్యోన్ముఖంగా నడిపిస్తాడు సత్కవి.

ఇలాంటి సత్కవుల కావ్యాలు సార్వకాలికాలవుతాయి వాళ్ళ పలుకులకు కాలదోషం పట్టదు. అలాంటివారి రచనలకు ప్రాచీనతను బట్టి గొప్ప గౌరవం కలుగుతుందనుకోటం సరికాదు. కావ్యంలో విషయాన్ని బట్టి గౌరవం కలగటం సరియైన పద్ధతి.

పూర్వ కవుల రచనల్లో రామణీయకతగాని హితంగాని జ్ఞాన ప్రబోధం కాని లేనప్పుడు ఆరచనలు గొప్పవికావు, సార్వకాలికాలు కాలేవు. వాటిని ఆదరించనక్కర్లేదు.

నిత్యసత్య విషయాలను రసవద్రచనలో జొనిపి విశ్వశ్రేయస్సుకై రచించినవి సర్వదా ఆరాధ్యాలే అవుతాయి.

ఆధునికులు వ్రాసినవన్నీ క్షుద్రరచనలనే అపోహ కూడా కొందరి కుంటుంది. అన్నీ సబబు కాదు. ఈరచనల్లో కవితాపదార్థం నిండుగా ఉన్నప్పుడు, అమూల్యమైన విషయాలు కనబడుతున్నప్పుడు అవి నీరసాలెట్లా అవుతాయి కావు. కవితాప్రయోజనం గల రసవత్కావ్యాన్ని క్రొత్త అనే భావంతో నిర్లక్ష్యం చేయకూడదు. కావ్యం ప్రాచీనం కాని అర్వాచీనంకాని మనం కోరేది దానిలోని ఉదాత్త భావరస సౌందర్యం. ఈసౌందర్యంలేనిదేదైనా ఆదర్శం కాదు

సత్పురుషులు అంటే సహృదయులు తమమేధాబలంతో వివేకించి క్రొత్తరచనైనా పాతరచనైనా సరే ఏది రసవంతమైతే దాన్నే గ్రహిస్తారు. వాళ్ళు హంసల లాంటివారు. మూఢులు మాత్రం అలాకాదు. సొంత ఆలోచన, వివేచనాశక్తి లేని వాళ్ళు కావటంచేత ఇతరుల నిర్ణయంపై ఆధారపడి నిర్ణయం చేస్తారు.

భగవంతుడు బుద్ధి నిచ్చినందుకు ఏ విషయాన్నైనా స్వయంగా పరిశీలించి మంచి చెడులు తెలుసుకోవాలి కాని యితరుల మీద ఆధార పడితే ప్రయోజనం లేదు. అది మూఢాచారమౌతుంది. అంధానుకరణం సరియైన నిర్ణయం కాదు. తాత ముత్తాతల నుంచి వున్న బావికదా అనిచెడిపోయినబావిలోని ఉప్పు కషాయంగా వున్న నీళ్ళెవరన్నా తాగుతారా! ఒక వేళ తాగితే తాగినవాడికేనష్టం. అలాగే పరాయి బుద్ధి మీద ఆధారపడి ప్రవర్తించేవాడు. పరప్రత్యయ నేయబుద్ధి. ఇలాంటి చక్కని అమృత వాణినందించిన మహాకవి కాళిదాసు.



స్నేహ దీపిక

ఒక మనిషి
ఇంకొక మనిషితో
సంబంధాన్ని
కలుపుకోటం కాదు
ఒక మనసు
ఇంకొక మనసుతో
స్నేహాన్ని
నిలుపుకోవాలి!

—ఆచార్యభావన్, విజయనగరం

లక్ష్మణస్వామి ప్రఖ్యాత నవలా రచయిత్రి శ్రీమతి జొన్నలగడ్డ లలితాదేవి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అధ్యక్షురాలు డా. తెన్నేటి హేమలత ప్రభృతులు ప్రసంగించారు.




ప్రఖ్యాత సస్పెన్స్ నవలా రచయిత్రి 'శ్రీమతి రావినూతల సువర్ణా కన్నన్ ప్రార్థనా గీతంతో ప్రారంభించబడిన ఈ ఉత్సవ కార్యక్రమములో 'నవ్యకవి' నాదెళ్ళ పురుషోత్తమ శాస్త్రి, కార్యక్రమంలో పాల్గొన్నవారిని వేదిక మీదకు ఆహ్వానించారు. ఏలూరు డిప్యూటీ కలెక్టర్. ఆంధ్ర సారస్వత సమితి అధ్యక్షులు శ్రీబోయిన వెంకటేశ్వరావు_తమ సహజ వాగ్ధోరణిలో వక్తల ప్రతిభావిశేషాలను సభకు పరిచయం చేసారు. 'మధురకవి' 'శ్రీముదిగొండ నాగమల్లి ఖార్జునరావు పద్య కుసుమాంజలి 'శ్రీవాణి' కి సమర్పించారు.

ఈ కార్యక్రమంలో పెద్దలు, అనుభవజ్ఞులు అయిన శ్రీ భావరాజు నరసింహారావు, 'కవిశేఖర' శ్రీ గురుజాడ రాఘవశర్మ, 'అభినవ రామకృష్ణ' శ్రీ అద్దేపల్లి లక్ష్మణ స్వామిగార్లకు శ్రీ కొామరగిరి సన్మానం చేయడం హర్షించదగ్గ ప్రధాన విషయం.

కార్య క్రమానంతరం శ్రీ సత్య కూచిపూడి జానపద నృత్య అకాడమీ—ఏలూరు వారు కూచిపూడి నృత్యం, జానపద నృత్యం, నాగిని, భామాకలాపం, అలివేలు మంగవిలాపం వగైరాలు ప్రదర్శించి సభికుల ప్రశంసల నందుకున్నారు.

శ్రీ కోరాడ శిష్యులైన శ్రీ కె. వి. సత్యనారాయణ సత్యభామగాను, అలివేలుమంగగాను, ఎనిమిది సంవత్సరాల బాలుడు షణ్ముక శ్రీనివాస్ యిచ్చిన ప్రదర్శనలు సభికులను ఎంతో ఆకర్షించాయి. శ్రీ పి.వి ఆర్.కె. ప్రసాద్ నాట్యకళా విశారద శ్రీ కె.వి. సత్యనారాయణకు పుష్పమాల వేసారు. శ్రీ కొామరగిరి, శ్రీ బోయిన ప్రభృతులు సన్మానం చేసారు. వివిధ సాహిత్య సంస్థలుకూడా పూలమాలలతో శ్రీ సత్యనారాయణను సన్మానించారు.

గత మూడు దశాబ్దాలలో బందరు ఇటువంటి సాహితీ మహోత్సవం జరుగలేదనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు. సభానంతరం ఇంటికి తిరిగి (రాత్రి 12 గంటలకు) వెళ్తూ ఒక అనుభవజ్ఞుడైన పెద్దమనిషి "ఇది శ్రీవాణి ఆవిష్కరణ మహోత్సవం కాదు. శ్రీకృష్ణదేవరాయల దర్బారు, భువనవిజయం" అన్నారు. ఇది యదార్థం. ఈ కార్యక్రమం ప్రతివ్యక్తిని కదిలించినదనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

—పిడుగు రామలింగయ్య



# భారతదేశంపార్టీ ఆవిర్భావం

## ఎన్. టి. ఆర్. పతనానికి ఆరంభమా?

"భారతదేశం కావాలా? తెలుగుదేశం కావాలా? తేల్చుకోండి" అని విజయవాడ ఎన్నికల సభలో రాజీవ్‌గాంధీ ప్రశ్నించారు. నాలాంటి వారికి ఆశ్చర్యం వేసింది. కాబోయే ప్రధాని ఈవిధంగా మాట్లాడటమేమిటి? అని అనుకున్నారు చాలామంది ఒకటి కోరుకుంటే రెండవది పోతుందేమోననే భయం కూడా కల్గింది. అసలు భారతదేశంపార్టీ అప్పుడు లేదుగదా! ఆనాడు ఎన్నికల రంగంలో తెలుగుదేశం పార్టీ ఒకటేగదా వున్నది. అందువలన తెలుగు ప్రజలు తెలుగు దేశం పార్టీకే విజయాన్ని చేకూర్చడం జరిగింది. ఇప్పుడు ఆ కొరతకూడా లేకుండా చేస్తున్నారు 'యన్.టి.ఆర్.'

మే 28 న భారతదేశంపార్టీ ఆవిర్భవించబోతున్నది. లోక్‌సభ ఎన్నికల విజయోత్సాహం, జాతీయ స్థాయిలో కొత్త పార్టీ పెట్టాలనే ఆలోచనను దృఢతరం చేసింది. దేశంలో ప్రతిపక్షాలు నామరూపాలు లేకుండా పోవడం, లోక్‌సభలో తెలుగుదేశంపార్టి ప్రతిపక్షస్థానాన్ని అలంకరించడం యన్. టి. ఆర్. కు స్ఫూర్తినిచ్చాయి. యన్.టి.ఆర్. క్రొత్తపార్టీ ఆవశ్యకతను గురించి వివరిస్తూ 'ఇందిరా కాంగ్రెసు రాష్ట్రాల అవసరాలను తీర్చలేకపోవడంవలన ఈ జాతీయపార్టిని స్థాపిస్తున్నాను" అని ఢిల్లీలో పత్రికా విలేఖరుల సమావేశంలో చెప్పారు. అయితే యిది దూరదృష్టిలేని దురాలోచన. విజయోత్సాహ సంబరంలో, పెల్లుబికిన ఆనందంలో, వాస్తవిక విషయాలను పరిగణనలోనికి తీసికొనకుండా, తీసుకోబడినతొందర పాటు నిర్ణయానికి యిది నిదర్శనం. అంతేకాదు యిది దురాశతో కూడిన దుస్సాహసం.

ఒక సినిమా 'హిట్' అయిందనే ఆనందంలో, మరొక సినిమామీద భారీఎత్తున డబ్బు ఖర్చుపెట్టడంలాంటి దుస్సాహసం. కొన్ని కొన్ని సందర్భాలలో సాహస నిర్ణయాలు కలిసిరావచ్చు. మరికొన్ని సందర్భాలలో బెడిసికొడితే ప్రమాదం కూడా లేకపోలేదు. అప్పుడు ఉన్నదీ పోతుంది. ఉంచుకున్నదీ పోతుంది. అప్పుడు పశ్చాత్తాప పడినా ప్రయోజనం మాత్రం వుండదు.

కాంగ్రెస్‌మీద విసిగి వేసారిపోయిన సమయంలో యన్.టి.ఆర్. రాజకీయరంగ ప్రవేశం చేసారు. మన రాష్ట్రంలో కాంగ్రెసుకు ప్రత్యామ్నాయంగా, ఏ ప్రతిపక్షం లేనప్పుడు, యన్.టి.ఆర్. ధైర్యంగా అన్ని సీట్లకు పోటీ పెట్టారు. గ్రామగ్రామానా అవిరామంగా తిరిగి తెలుగు ప్రజలను చైతన్యవంతులను గావించారు. అప్పుడు వారిపాత్ర 'హిట్' అయింది. కాంగీని ఓడించి తెలుగు దేశం పార్టీ అధికారంలోనికి తీసుకొనివచ్చిన ఘనత తెలుగువారికి దక్కింది. ఇదంతా నా మహిమేనని యన్.టిఆర్. ఒకవేళ భావిస్తే, ఆయనకు ఏమాత్రం రాజకీయ పరిజ్ఞానం లేదని భావించవలసివస్తుంది. ఆనాడు చారిత్రక, రాజకీయ పరిస్థితులు అలా కలిసి వచ్చాయి. అదృష్టదేవత ఆయననువరించింది.

యన్.టి.ఆర్ గ్లామర్ తగ్గుతున్న రోజులలో నమ్మకద్రోహి నాదెండ్ల కుట్రవలన యన్.టి.ఆర్. పదవీచ్యుతులైనారు. యన్.టి.ఆర్.కు అది ఒక వరమైంది. ప్రతిపక్షాలు ఒక త్రాటిమీద నడిచి మద్దతునిచ్చాయి. ఆంధ్రప్రజలు ఉవ్వెత్తున లేచారు.కనీవిని ఎరుగని మహోద్యమం చెలరేగింది. యన్.టి.ఆర్. తిరిగి తన పదవిని అధిష్టించగలిగారు. నాదెండ్ల కుట్రవలన పరోక్షంగా యన్.టి.ఆర్.కు మేలే జరిగింది. లోక్‌సభ ఎన్నికలలో మిత్రపక్షాలు కలిసివచ్చాయి. రాష్ట్ర సమస్యలమీద లోక్‌సభలో శక్తివంతంగా పోరాడటానికి మంచి ప్రాతినిధ్యం, చేకూర్చమని యన్.టి.ఆర్. చేసిన అభ్యర్థనను తెలుగు ప్రజలు మన్నించారు. దేశం మొత్తంలో రాజీవ్‌గాంధీ పవనాలు

తీవ్రంగా వీస్తున్న తరుణంలో కూడా తెలుగు ప్రజలు ధైర్యంతో యన్.టి.ఆర్.కు విజయం చేకూర్చారు. లోక్ సభలో ప్రధాన ప్రతిపక్షంగా వ్యవహరించడానికి అవకాశం యిచ్చారు.

తాము ఏమి చెబితే అదే తెలుగుప్రజలు అంగీకరిస్తారనే ధీమాతో, యిప్పుడు భారతదేశం పార్టీని పెడతామని యన్. టి. ఆర్. ప్రకటించారు. ఒకవేళ తెలుగు ప్రజలు ఈ అభిప్రాయానికి ముద్ర వేసినా, మిగతా రాష్ట్రాల ప్రజల మద్దతు కావాలి కదా! ఈ ఎన్నికలలో మహా మేధావులు, రాజకీయ దురంధరులు, కాకలుతీరిన యోధులు నేలకరిచారు. ఈ సరికొత్త ఆలోచన 'హిట్' కావడం అంత తేలిక మాత్రం కాదు. పైపెచ్చు దేశంలో యితర ప్రతిపక్షాల సానుభూతినికూడా కోల్పోయే ప్రమాదం వున్నది. జాతీయ పార్టీ మోజులో పడి మన రాష్ట్రమును తీర్చిదిద్దే ప్రయత్నంలో అలసత్వం ఏర్పడుతుంది. అప్పుడు తనను నమ్ముకొనిన తెలుగువారిలో అసంతృప్తి చెలరేగుతుంది. ఈ అవకాశాన్ని కాంగ్రెసు ఉపయోగించుకుంటుంది. అప్పుడు యన్.టి.ఆర్. ఉభయభ్రష్టత్వం అయ్యే ప్రమాదం కూడా వున్నది. అందుకే పెద్దలు 'ఇంటగెలిచి రచ్చ గెలవమన్నారు' అది లేకుండా దేశాన్ని సంస్కరించాలనే తాపత్రయంలో తొందరపాటు నిర్ణయాలను గైకొంటే చైతన్యరథం ప్రమాదానికి గురికావచ్చును.

తెలుగు ప్రజలు యన్.టి.ఆర్. మీద ఎంతో ఆశ పెట్టుకున్నారు. యన్.టి.ఆర్. ఎన్నో వాగ్దానాలు చేసారు. అమలుపరచినవి మాత్రం బహు తక్కువ. అయినప్పటికి మరికొంతకాలం అవకాశం యిచ్చి చూడాలనే అభిప్రాయంలో తెలుగు ప్రజలు వున్నారు. ఇప్పటికే ఈ ఎన్నికలలోనే లోగడ కన్నా మెజారిటీ తగ్గింది. మిత్రపక్షాల అండలేకపోతే సుమారు 10 నియోజక వర్గాలు జారిపోయేవి. హైదరాబాద్ మల్కాపేట కాలనీలో తెలుగుదేశానికి ఒకేఒక ఓటు రావడం ఆశ్చర్యకరం. వత స్వంత నియోజక వర్గంలో (గుడివాడ), లోగడ వచ్చిన మెజారిటీ పోవడమే గాక సుమారు 6 వేల ఓట్లు తక్కువ వచ్చాయి. దీనికి కారణమేమిటో యన్. టి. ఆర్. ఆత్మ పరిమర్శన చేసుకోవాలి. అది లేకుండా క్రొత్త జాతీయపార్టీ పెట్టాలనే తాపత్రయ పడటం అవివేకం, అవాస్తవికం అనాలోచితం. అంతేకాదు వీరి ప్రవర్తనవలన మిత్రపక్షాలుకూడా ఈ తడవ శాసనసభాఎన్నికలలో దూరమయ్యే ప్రమాదం కూడా వున్నది.

'Slow and study wins the race' అనే సామెతను మరచిపోకూడదు. 'Haste makes waste' తొందరపడి ఏ పనీ చేయరాదు. ఆవేశం అరిష్టాలకు మూలం. ఆవేశం పనికి రాదు. ఆలోచన కావాలి. తొందరపాటుతనం ప్రమాదానికి గురిచేస్తుంది. తెలుగుదేశం అభివృద్ధికోసం ఈ విషయంలో యన్. టి. ఆర్. ప్రశాంతంగా పునరాలోచించాలి.

అదృష్టదేవత వరిస్తే తప్ప, భారతదేశం పార్టీ ఆవిర్భావం, యన్. టి. ఆర్. పతనానికి ఆరంభమా? అనే అనుమానాన్ని రాజకీయ పరిశీలకులు, విజ్ఞులు, మేధావులు వెలిబుచ్చుతున్నారు. ఈ విషయం చరిత్రే నిర్ణయించాలి.

- 'సవ్యసాచి'

ము ఖ్య గ మ ని క

ఈ సంచిక కవరుపేజి (4వ పేజి) ప్రకటనలో పొరపాటున పుస్తకాల వెల ఇవ్వలేదు.

గమనించ ప్రార్థన

| | |
|---|---|
| బాలవిజ్ఞాన కోశము | రు. 12-00 |
| వివేకవాణి | రు. 10-00 |
| రామాయణపాత్రలు | రు. 6-00 |
| గాంధీ-లోహియా-దీనదయాల్ | రు. 10-00 |

# అదృష్టదేవత వరించిన నేతలు

## భారతదేశంలో...
## ప్రతిపక్షాలను చిత్తుచేసిన ధీరుడు

"మేధావిగా పుట్టటంకంటే, అదృష్టవంతుడిగా పుట్టటం మేలు" అనిన అనుభవజ్ఞుల పలుకులు రాజీవ్‌గాంధీ విషయంలో నూటికి నూరుపాళ్ళు యదార్థం. ఎనిమిదవ లోక్‌సభ ఎన్నికలు ఈ నగ్నసత్యాన్ని ఋజువు చేసాయి. ఈ ఘనవిజయం కాంగివారికి సహితం విభ్రాంతిని కలుగజేసింది. శ్రీమతి గాంధీ బ్రతికి వుండి ఈ ఎన్నికల రంగంలో దిగివుండి వుంటే ఇంతటి ఘనవిజయాన్ని సాధించి వుండేదికాదేమో! అదృష్టవంతులకు అన్ని పరిస్థితులు వాటంతట అవే సానుకూలంగా మారుతాయి. రాజీవ్‌గాంధీకి చెప్పుకోదగ్గ గత చరిత్ర లేకపోయినప్పటికీ అనుభవం అంతకన్నా లేకపోయినప్పటికీ, స్వాతంత్ర్య సంగ్రామంలో అహర్నిశలూ కృషిచేసి, సర్వస్వాన్ని సమర్పించిన పండిత నెహ్రూ కన్నా ఎక్కువ మెజారిటీని సంపాదించిన ఘనతమాత్రం రాజీవ్‌కు దక్కింది. అదృష్టవంతులకు అలాగే అన్నీ కలసి వస్తూంటాయి.

రాజీవ్‌గాంధీ విజయానికి ప్రధానకారణాలు :-

1. దురదృష్టకరమైన పరిస్థితులలో శ్రీమతి గాంధీ ఉగ్రవాద శిక్కుజవానుల చేతులలో హత్య గావించబడటం 2. పంజాబు మారణ హోమం 3. ప్రతిపక్షాల అనైక్యత.

శ్రీమతి గాంధీ దుర్మరణంకూడా కాంగివారికి బాగా ఉపయోగపడింది. అందుకోసమనే ఎన్నికలు కూడా ముందుకు జరపడం జరిగింది. ముఖ్యంగా ఉత్తరభారతంలో అమ్మ సానుభూతిని బాగా సొమ్ముచేసుకోవడం జరిగింది. అందులో సమయానికి పంజాబు సమస్యకూడా ఈ ఎన్నికలలో బాగా ఉపయోగించుకోవడం జరిగింది. పంజాబు ఉగ్రవాదశిఖులు హిందూనాయకులను అనేకమందిని ఘోరంగా హత్యచేసారు. పంజాబు, ఢిల్లీలలో బీభత్సాన్ని సృష్టించారు. హిందువులకు రక్షణ లేకుండాపోయింది. అటువంటి స్థితిలో శ్రీమతి గాంధీ స్వర్ణదేవాలయంమీద సైనిక చర్య గైకొనడం జరిగింది. అసలు ఈ పంజాబు సమస్య ఈ స్థితికి చేరుకోవటానికి శ్రీమతి గాంధీ అనుసరించిన విధానాల ఫలితమే. ఉగ్రవాద శిఖునాయకుడైన 'బింద్రన్‌వాలే'ను పెంచి పోషించిందికూడా శ్రీమతి గాంధీయే. ఈ యదార్థ నగ్నసత్యాన్ని హిందువులు మరచిపోయారు. ఆపదలో వుండేవారికి గతాన్ని గురించి ఆలోచించే శక్తి సహజంగా వుండదు. సమయంకూడా వుండదు. ఆపదలోనున్న సమయంలో ఎవరు రక్షిస్తే వారే గుర్తు వుంటారు. ఈ విషయంలోకూడా అదే జరిగింది. అసలు సమస్యకు ఆమే బాధ్యురాలయినప్పటికి శిఖ్ఖుల అకృత్యాల నుండి రక్షించిన ఘనతమాత్రం శ్రీమతి గాంధీకి దక్కింది. అందులో శ్రీమతి గాంధీని హత్యచేసినవారు, దురదృష్టవశాత్తు శిఖు జవానులు కావడంవలన, హిందువులు కోపోద్రిక్తులైనారు. 'అగ్నికి ఆజ్యం పోసినట్లుగా' కాంగివారు పనిగట్టుకొని ఉద్రేకాలను రెచ్చకొట్టారు. మారణహోమాన్ని సృష్టించారు దానినుండి లాభాన్ని సంపాదించారు. అమ్మ హత్యా వుదంతాన్ని బాగా ప్రచారం చేసారు. సానుభూతిని సొమ్ము చేసుకున్నారు.

దీనికితోడు ప్రతిపక్షాలు ఒక త్రాటిక్రిందకు రాలేకపోయాయి. స్వార్థం, అహంకారాలతో "నేపట్టిన కుందేటికి మూడే కాళ్ళు" అన్నట్లుగా ప్రతిపక్ష నాయకులు వ్యవహరించారు. ఒకే సీటులో ప్రతిపక్షాలవారందరూ తారసిల్లారు. కాంగికి యిది ఒక వరంగా లభించింది. సీట్ల సర్దుబాటు విషయంలో ఒక అవగాహనకు రాలేనివారు మిశ్రమ ప్రభుత్వాన్ని ఏ విధంగా స్థాపించగలరు?" అని ఎలుగెత్తి చాటిన రాజీవ్ ప్రచార నినాదం ప్రజలకు బాగా

వచ్చింది. అందులో ఈఎన్నికలలో దాదాపు అన్ని సీట్లకు పోటీచేసిన పార్టీ కాంగి తప్ప మరే పార్టీ లేకపోవడంకూడా వారికి లాభించింది. అనైక్యతతో, అహంభావంతో వారిలో వారు పోటీ పడుతున్న ప్రతిపక్షాలకు ఓటు వేయడం నిష్ప్రయోజనమని ఓటర్లు భావించారు. మంచో చెడో ఒకే పార్టీగా, ఒకే నాయకత్వం క్రింద పోటీ చేస్తున్నవారికి ఓటువేస్తే ప్రయోజనం వుండవచ్చునని ఓటర్లు భావించి, ఓటును కాంగికి వేసారు. రాజీవ్ గద్దెను స్థిరం చేసారు. అదృష్టదేవత రాజీవ్‌గాంధీని వరించింది. భారతదేశంలో ప్రతిపక్షాలను చిత్తుచేసిన ధీరుడిగా ఘనత ఆయనకు దక్కింది. ప్రతిపక్షాలకు గుణపాఠం నేర్పిన ఘనత ఓటర్లకు దక్కింది.

## తెలుగుదేశంలో... ...
## కాంగీని చిత్తు చేసిన వీరుడు

దేశం మొత్తంలో శ్రీమతి గాంధీ సానుభూతి పవనాలు వీచినా, ఆంధ్రప్రదేశ్‌లో మాత్రం యన్. టి. ఆర్. దే పైచేయి అయింది. ఇది తెలుగువారి ప్రత్యేకత. కేంద్రములో జనతా ప్రభుత్వం వున్న తరుణంలో, మన రాష్ట్రంలో కాంగికి తెలుగు ప్రజలు అధికారం ఇచ్చారు. కేంద్రంలో కాంగీ అధికారంలో వున్నప్పుడు యిక్కడ తెలుగుదేశం పార్టీకి అధికారం ఇచ్చారు. మరల ఇప్పుడు దేశం మొత్తంలో ప్రతిపక్షాలు నామరూపాలు లేకుండా పోయిన తరుణంలో,తెలుగుదేశంపార్టీని నెగ్గించి,లోక్‌సభలో ప్రధానప్రతిపక్షంగా వ్యవహరించడానికి అవకాశం ఇచ్చిన ఘనత తెలుగువారికే దక్కింది. మన రాష్ట్రంలో ఇంతటి ఘనవిజయం ప్రతిపక్షాలకు చేకూరడానికి కారణం యన్. టి.ఆర్. ఆకర్షణతోపాటు ప్రతిపక్షాలు ప్రదర్శించిన సమైక్యతకూడా బాగా ఉపయోగపడింది. ఖమ్మం సీటులో ఉభయ కమ్యూనిష్టులు పోటీపడ్డారు. అపజయాన్ని చవిచూచారు. అదేవిధంగా ఇతర రాష్ట్రాలలో ప్రతిపక్షాలు ఒకే సీటులో తారసిల్లడంవలన నష్టపోయారు. యిక్కడ ప్రతిపక్షాలన్నీ ఏకత్రాటిమీద నడవడంవలన, రాజీవ్‌గాంధీ ఆంధ్రప్రదేశ్‌లో నాలుగురోజులపాటు పర్యటించి ఎన్ని.మాటలు చెప్పినా ప్రయోజనం లేకపోయింది.

అసలు కొంతమంది అదృష్టవంతులకు తాము తీసుకొనే సాహస నిర్ణయాలవలన కూడా కలిసి వస్తుంటుంది. లోగడ శ్రీమతి గాంధీకికూడా అదేవిధంగా కలిసివచ్చేది ఇప్పుడు యన్. టి. ఆర్. కు కలిసివస్తున్నది. రెండు సంవత్సరాలు నిండకముందే యన్. టి. ఆర్. శాసనసభను రద్దుచేశారు. అందులో, లోక్‌సభ ఎన్నికలముందు రద్దుచేసారు. ఇంకా కొంచెం ముందుగా చేసివుండినయెడల లోక్‌సభ ఎన్నికలతోపాటు, శాసనసభా ఎన్నికలుకూడా కలిసి వచ్చేవి. వివేకం లోపించిన నిర్ణయమని పత్రికలు, మేదావులు విమర్శించడం జరిగింది. అయితే యన్.టి.ఆర్ ధైర్యంగా విమర్శకులకు సమాధానం చెప్పారు. ఆంధ్ర ప్రజలకు యిచ్చిన వాగ్దానాన్ని భంగం చేసిన స్వార్థపరులైన వారికి శాసనసభలో స్థానం లేకుండా చేయడమే తన లక్ష్యమని యన్.టి.ఆర్. వివరించారు. లోక్‌సభ ఎన్నికలతో ముడిపెట్టకుండా, ప్రజల తీర్పుకోసం మరొక పర్యాయం శాసనసభ ఎన్నికలద్వారా ప్రజల ముందుకు వస్తానని వాగ్దానం చేసారు. ప్రజలు విశ్వసించారు. లోక్‌సభ ఎన్నికలలో కూడా తెలుగుదేశం, దాని మిత్రపక్షాలకే విజయం చేకూర్చారు. దేశప్రజలందరూ ఒక వైపు మొగ్గినా, తెలుగువారు మాత్రం ధైర్యంగా ప్రతిపక్షాలనే నెగ్గించారు. భారతదేశంలో ప్రతిపక్షాలను చిత్తుచేసిన ధీరుడు 'రాజీవ్‌గాంధీ' అయితే; తెలుగుదేశంలో కాంగీని చిత్తుచేసిన వీరుడు 'యన్.టి. ఆర్. వీరిద్దరూ అదృష్టదేవత వరించిన నేతలే అనడంలో ఏమాత్రం అతిశయోక్తి లేదు.

---

### ఏజంట్లకు మనవి

'శ్రీవాణి' ప్రతినెలా మూడవవారంలో వెలువడుతుంది. గతనెల బిల్లు డబ్బుప్రతినెలా 15వ తేదీలోపు పంపవలెను. కాపీలు ఎక్కువగా కావలసిన ఏజంట్లు ప్రతినెలా 5 వతేదీ లోపు తెలియపరచవలెను.

# స్వార్థం, పట్టుదలలతో పతనమైన

# కాకలుతీరిన యోధులు

## జీవితపరమావధి నెరవేరినా ... ... తృప్తిలేనివృద్ధ నాయకుడు

కొంతమంది ఆశాజీవులు. జీవితపరమావధి ఒక పర్యాయం నెరవేరినా తృప్తిపడక రాజకీయాలలో మారు పట్టుకొని వ్రేలాడుతునే వుంటారు. ఈ కోవకు చెందిన వారిలో అగ్రగణ్యులు 'వృద్ధనాయకుడుచరణ్‌సింగ్' వీరికి తృప్తిలేదు. అదృష్టదేవత మరొక పర్యాయం వీరిని వరించడానికి సిద్ధంగా వున్నట్లు కనుపించడంలేదు. ఇదీ వీరి పరిస్థితి. పట్టువిడవని భట్టివిక్రమార్కుడిలాగే నిరంతర పోరాటం కొనసాగిస్తునే వుంటారు వీరు. మరొక పర్యాయం ప్రధానమంత్రి కావాలని వీరి తాపత్రయం. ఈ ఆశయసిద్ధికోసం ఏ పనైనా చేయగల సమర్థులు. ఇతర పార్టీలలో చిచ్చుపెట్టడానికి కూడా ఏమాత్రం వెరువరు. ఇతర పార్టీలతో చేతులు కలిపినట్లుగ నటిస్తారు. ఒకరితో చేతులు కలిపి మరొకరికి సైగచేయగల సమర్థులు వీరు. ఎవరితో ఎంతకాలం కాపురం చేస్తారో రాజకీయ మేధావుల ఊహకుకూడా అందదు. వీరి పార్టీ అనేక రూపాలు మారి నేడు దళిత మజ్దూర్ కిసాన్ పార్టీగా అవతరించింది ఈ అవతారంలో వీరి పార్టీ ఎంతకాలం వుంటుందో ఆ భగవంతునికే తెలియాలి. ఈ ఎన్నికలలో వీరి పార్టీ 168 స్థానాలకు పోటీచేసి మూడు స్థానాలను మాత్రం సంపాదించుకోగలిగింది. వీరు మునిగారు. వీరితోపాటు ఇతర ప్రతిపక్షాలను కూడా ముంచివేసారు. ఈ వృద్ధ నాయకుడు ఎంత త్వరితంగా రాజకీయాల నుండి విరమిస్తే అంత దేశానికి మేలుచేసిన వారవుతారని ప్రజల భావన.

## జీవితపరమావధి నెరవేరని

కొంతమంది నష్టజాతకులు జీవితపరమావధి నెరవేరకుండానే రాజకీయాలనుండి నిష్క్రమించవలసి వస్తుంది. జగజ్జీవన్‌రాం విషయంలోకూడా యిది యదార్థం కాబోతున్న సూచనలు కనిపిస్తున్నాయి. స్వాతంత్ర్యకాలం నుండి ప్రధానపాత్ర వహించిన బడుగువర్గాల ప్రతినిధిగాను లోక్‌సభ ఏర్పడినప్పటినుండి వరుసగా ఎనిమిది పర్యాయాలు గెలిచిన ఘనత ఈయనకు దక్కింది. 1980లో ప్రధానమంత్రి కావలసిన నేత. అయితే ఆనాడు అదృష్టదేవత వీరిని తిరస్కరించింది. ఇప్పుడు చావుతప్పి కన్ను లొట్టపోయినట్లుగా బహుకొద్ది మెజారిటీతో నెగ్గారు. ఈయన 1980 లోనే రాజకీయాల నుండి నిష్క్రమిస్తే గౌరవంగా వుండేది. అవసానకాలంవరకు అధికారంలో వుండిపోవాలని నేతలు కోరుకోవడం, నిజంగా ఈదేశానికి దురవస్థ. చాలామంది కురువృద్ధులకు వారసుడ్ని తీసుకొని రావడానికి ఇష్టం వుండదు. ఒకవేళ ఎవరైనా వారసుడిగా ముందుకు వస్తే, వారిని ఏదోవిధంగా ప్రక్కకు నెట్టే ప్రయత్నం వృద్ధనాయకులు చేస్తూనే వుంటారు.



ఆఖరిక్షణంవరకు అధికారంలో వారే వుండాలని, అధికారలాంఛనాలతో స్మశాన వాటికకు చేరుతేనే ముక్తి వస్తుందని భావించడంవలననే, భారతదేశ ప్రజాస్వామ్య వ్యవస్థప్రమాదంలో పడుతున్నది. ఈ ఆలోచన మారాలి. యువకులకు అవకాశం యివ్వాలి. సముచిత సలహాలనిస్తూ యువతరాన్ని సక్రమమార్గాన నడిపించాలి. అప్పుడే వీరు దేశానికి మేలుచేసినవారవుతారు. 'అధికారం వుంటేనే ప్రజాసేవ చేయగలుగుతాం' అనే అభిప్రాయానికి తిలోదకాలివ్వాలి. లోకనాయక్ జయప్రకాష్‌కు ఏ అధికారమున్నది? ఏమీ లేకపోయినా ప్రజలను చైతన్యవంతులను చేయగల్గిగారు. ప్రభుత్వాన్ని శాసించగలిగారు, అంతేకాదు మార్చగలిగారు కూడాను. కనుక అనుభవం వున్న వృద్ధ నాయకులు జయప్రకాష్‌ను ఆదర్శంగా గైకొంటే దేశానికి మంచి చేకూరవచ్చును.

## అనుభవం వుండి.......
## అహంకారం వీడని మేధావి

'అన్నీ వుండి అల్లుడి నోట్లో శని వుంది' అన్నట్లుగా అనుభవం వుండీ, తెలివితేటలు వుండీ, అహంకారం వీడని మేధావి 'మొరార్జీ'. వీరి పట్టుదల, మంకుతనంవలన లోగడ జనతా ప్రభుత్వం పతనమైంది. అయినప్పటికి వీరికిజ్ఞానోదయం మాత్రం కాలేదు. వీరు అధికారం కోర నంటారు. కాని వీరు చెప్పినవారికే అధికారం రావాలంటారు. తన పార్టీని పైకి తీసుకొనిరావడానికి నిష్కామకర్మ మాత్రం చేయరు. మరే యితర పార్టీ అధికారంలోనికి రావడానికి వీరికి సుతరామూ యిష్టముండదు. తన స్వంత నియోజక వర్గంలో బి. జే. పి. పోటీచేస్తుండటంవలన వీరు తన ఓటును వేయలేదు. వేయకపోతే వేయకపోయారు. వేయకపోవడం ఒక ఘనతగా భావించి పత్రికా ప్రకటన కూడా చేసారు. ఈ ప్రకటన వలన వచ్చే నష్టం ఏమిటో కూడా ఆలోచించని మహా మేధావి ఈయన. ప్రధాన మంత్రి చేసిన ఈ పెద్దమనిషి ఓటుచేయకపోవడం నేరం కాదా? ఈ విషయం వారి ఆలోచనకు స్ఫురించలేదేమో! వయోవృద్ధులు కావడంవలన, మతిస్థిమితం లేక బాధ్యత లను విస్మరించారేమో; ఏదిఏమైనప్పటికి ఈ కురు వృద్ధులవలననే ప్రతిపక్షాల ఐక్యత దెబ్బ తిన్నది. వీరు ఎంత త్వరితంగా రాజకీయాల నుండి నిష్క్రమిస్తే అంత దేశానికి మంచిది.

## గురువుకు పంగనామాలు పెట్టిన శిష్యుడు

కొంతమందికి కోపంవస్తే, వారి వళ్ళు వారే మరచి పోతారు. ఆ సమయంలో ఏమి చేస్తారో ? వారికి తెలియదు. ఆ కోవకు చెందినవారు 'రాజ్‌నారాయణ్'. జనతా ప్రభుత్వ పతనానికి మూలపురుషులలో వీరుకూడా ఒకరు. వీరిని కోపం వచ్చినా పట్టలేం సంతోషం వచ్చినా భరించలేం. ఈయన ఒకప్పుడు 'చరణ్‌సింగ్'కు నమ్మినబంటు 'రామభక్తహనుమాన్' అని వారే చెప్పుకొని కోతిచేష్టలు చేసారు. చివరికి 'చరణ్‌సింగ్' మీదనే వీరికి కోపం వచ్చింది. అలనాడు శ్రీరామునితో హనుమంతుడు యుద్ధం చేసాడుగదా! అది గుర్తుకు వచ్చి ఈయనకూడా గురువు గారిమీద ఈ ఎన్నికలలో పోటీచేసాడు. వీరు రామభక్త హనుమాన్ అని చెప్పుకోవడంకూడా ఆ హనుమంతుని కూడా కించపరచడమే అవుతుంది. ప్రతికోతి హనుమంతుడు కాలేదుగదా! ఒకప్పుడు ఈయన శ్రీమతి గాంధీ ఓడేంత వరకు గడ్డం తీయనని ప్రతిజ్ఞ చేసాడు. ఇప్పుడు ఆ అమ్మ కొడుకుతో లాలూచీపడి గురువుగారి మీదకు దూకడం బాధాకరమైన విషయం. రాజకీయాలలో ఎవరు, ఎంతకాలం, ఎక్కడ, ఏవిధంగా వుంటారో చెప్పడం కష్టంగా వున్నది. అలనాడు జనతా ప్రభుత్వం అధికారంలోకివచ్చినప్పుడు రాజ్‌నారాయణ్‌ను గౌరవించి, ఆరాధించిన ప్రజలు, ఈనాడు వీరి వింత విచిత్ర ప్రవర్తనకు తలవంచుకోవలసిన

# అనుభవంవుండి అహంకార వీడని మహానాయకులు

పరిస్థితి, దుస్థితి ఏర్పడింది. ఇటువంటి చీడ పురుగుల వలన ప్రజాస్వామ్యంమీదనే ప్రజలకు విశ్వాసం సడలుతున్నది.

## ఊహాసౌధాలలో విహరిస్తున్న 'యంగ్‌టర్క్'

నెహ్రూకాలంలో 'యంగ్‌టర్క్'గా పేరు ప్రఖ్యాతుల నందుకున్నవాడు. 'చంద్రశేఖర్' ఆనాడు కాంగ్రెసులో వుంటూ నెహ్రూ విధానాలను దుయ్యబట్టిన ఘనత వీరికి దక్కింది. 'లోకనాయక్'ను అనుసరించి కాంగ్రెస్‌కు తిలోదకాలిచ్చారు ఈయన. ఆనాడు జనతాపార్టీ అధ్యక్ష స్థానం విషయంలో వివాదం ఏర్పడింది. పాతపార్టీల మధ్య ఏకాభిప్రాయం కుదరలేదు. ఏపెద్ద పార్టీ వెనుక లేని చంద్రశేఖర్‌ను అదృష్టదేవత ఆనాడు వరించింది. ఆ దెబ్బతో ఈయన కూడా మహానాయకుల జాబితాలో చేరారు. అవిభక్త జనతాపార్టీ పతనమైంది. అయినప్పటికీ మిగిలిన జనతాపార్టీకి ఈయనే అధినేతగా వుంటూ వచ్చారు. గత వైభవాన్ని సంతరించుకోవాలనే తాపత్రయంతో దేశమంతా పాదయాత్ర చేసారు. అయినప్పటికి ప్రయోజనం చేకూరలేదు. వీరివెంటవున్న వారిలో కొందరు దూరమైనారు. ప్రధానమంత్రి కావాలనే కోరిక మాత్రం వీరిని విడనాడలేదు. "తాతయ్యా! పెండ్లి చేసుకుంటావా?" అంటే కాదనలేదు. 'నాకిచ్చే వారెవరు?' అని తిరిగి తాతయ్య ప్రశ్నిస్తాడు. ఎవరైనాయిస్తే చేసుకుందామని తాపత్రయ పడతాడు. 'తాతయ్యా' వీరి పరిస్థితి కూడా అంతే. ఛాన్స్ తగులుతే చూచుకోవడంలో తప్పులేదు. దాని కోసం తాపత్రయం పడటం మాత్రం విజ్ఞత కాదు 207 స్థానాలకు పోటీచేసి 10 స్థానాలను సాధించింది.

'చెట్టులేనిచోట ఆముదం చెట్టే మహావృక్షం' అన్నట్లుగా జాతీయ ప్రతిపక్షాలలో ఎక్కువ సీట్లు సంపాదించిన ఘనత మాత్రం వీరికి దక్కింది. ఇది వీరి పరిస్థితి.

## నేలవిడిచి సాముచేసిన మహానాయకుడు

నేల విడిచి సాముచేసిన మహానాయకుడు 'వాజ్‌పాయి వీరు ఓడిపోయినందుకు భారతదేశంలోని చాలామంది ప్రజాస్వామ్యవాదులు బాధపడిన మాట వాస్తవమే. వీరు చేసిన స్వయంకృతాపరాధముల వలననే వీరు. వీరి పార్టీ ఘోర పరాజయాన్ని చవి చూశారు. అలనాటి అవిభక్త జనతాపార్టీలో వీరికి ప్రధానమైన గ్రూపు (మాజీ జన సంఘం). వీరు ఎక్కడ పెరిగిపోతారేమోనని కొందరు స్వార్థపరులు భయపడి ద్వంద్వ సభ్యత్వం (ఆర్. యస్. యస్. తో సంబంధమున్నదని బూచిని చూపి జనతాపార్టీని విచ్ఛిన్నం చేసారు. గత్యంతరంలేని పరిస్థితులలో బయటకి వచ్చి భారతీయ జనతాపార్టీని పెట్టుకున్నారు. కాంగీకి ప్రత్యామ్నాయం మాదేనని ప్రకటించుకున్నారు. ఆవిధముగా ప్రత్యేకతను నిలబెట్టుకుంటూ పార్టీ నిర్మాణం చేసుకుని వుంటే వీరి పరిస్థితి బాగుండేది. ఒకే పర్యాయం అధికారంలోనికి రావాలని తాపత్రయంతో చరణ్‌సింగ్ స్వరూప స్వభావాలు తెలిసికూడా పప్పులో కాలు వేశారు. చేయవలసిన పని చరణ్‌సింగ్ చేసారు. గత్యంతరంలేక పాడావిడిలో 226 స్థానాలకు పోటీచేసి రెండు స్థానాలను మాత్రం సంపాదించుకోగలిగారు. అయితే కాంగ్రెసు తరువాత భారతదేశంలో ఎక్కువ ఓట్లను సంపాదించుకొనిన ఘనత మాత్రం వీరికి దక్కింది.

కేసుపోయినా ప్లీడర్ బాగా వాదించా డన్నట్లుగా, వీరికి సీట్లు రాకపోయినా ఓట్లు మాత్రం అన్ని ప్రతిపక్షాలకన్నా ఎక్కువగా వచ్చాయనే సంతృప్తి మాత్రంవీరికి మిగిలింది.

## సి. పి. ఐ. ద్విపాత్రాభినయం

వీరు ఈ ఎన్నికలలో 61 స్థానాలకు పోటీచేసి 6 స్థానాలను మాత్రం సంపాదించుకున్నారు. ఎత్తులకు పైఎత్తులు వేయడంలో వీరు అగ్రగణ్యులు. వీరి ఎత్తులే వీరిని చివరకు దెబ్బ తీసాయి. పైకి మాత్రం పతిపక్షాల ఐక్యత అంటారు. బి.జె.పి. అంటే మాత్రం వీరికి గిట్టదు. వీరి మొండితనం వలసనే ఖమ్మం సీటు పోయింది. వేదికలమీద కాంగీని ఓడించమని ఉపన్యాసా లిస్తారు. వీరి కార్యకర్తలు మాత్రం పోయిన ఎన్నిక లలో చాలాచోట్ల కాంగీకి ఓటు చేసినట్లుగా ప్రజలు గుర్తించారు. అసలు వీరికి లోపల కాంగీ అంటే యిష్టం. రష్యా ఆదేశాలను వీరు కాదనలేరు. అయితే భారత దేశంలో కాంగీని బహిరంగంగా బలపరుస్తే, మిగిలివున్న పరువుకూడా పోతుందేమోననీ వీరి భయం.

పైకి ప్రతిపక్షం ఫోజు పెడతారు. ఇంట్లో అన్నంతిని ఇంటి వాసాలు లెఖ్ఖ పెట్టడం వీరికి అలవాటు. వీరిది ద్విపాత్రాభినయమేనని చరిత్ర చాటుతున్నది. అందుకే ఓటర్లు సరైన గుణపాఠం కూడా నేర్పారు.

## పునాది కదిలిన సి. పి. ఐ.యం.

వీరు ఈ ఎన్నికలలో 59 స్థానాలకు పోటీచేసి 22 సీట్లను సంపాదించుకోగలిగారు, లోగడకన్నా తక్కువ సీట్లు వచ్చిన మాట వాస్తవమే. బెంగాల్, కేరళలలో వీరి పునాది కదలిన మాటకూడా వాస్తవమే.

ఈ పెనుతుఫాన్‌లో కొంతవరకు నిలబడిన ఘనత మాత్రం వీరికి దక్కింది. ఈ ఎన్నికలలో కొంత దెబ్బ తిన్నదని ఎవరైనా భావిస్తే. అది పొరపాటే అవుతుంది. మొండితనం వీరికి పెట్టింది పేరు. దీనివలన వీరి పార్టీ కొంత నష్టపోతున్నది. సి. పి. ఐ. వారిని వదలి ఇతర జాతీయ ప్రతిపక్షాలతో చేతులు కలిపితే, వీరికి భవిష్యత్తు వుండవచ్చును.

## ఓటర్లు చేయవలసింది చేసారు

అనుభవంలేని అమ్మ కొడుకుకు ఓటు చేయాలో, అనుభవంవుండి స్వార్థం, అహంకారాలతో తమలో తాము క్రుమ్ములాడుకుంటున్న ప్రతిపక్షాలకు ఓటు యివ్వాలో అర్థంకాక ఓటర్లు సతమతమైనారు. స్వార్థం, అహం కారాలతో తగవులాడుకొంటున్న, అనుభవంవున్న వారికి ఓటుయిస్తే. అనతికాలంలోనే ప్రభుత్వం పడిపోయి, దేశంలో అస్తవ్యస్తమైన పరిస్థితి ఏర్పడే ప్రమాదంవున్న దని ఓటర్లు గ్రహించారు. అనుభవం లేకపోయినా, ఒక పార్టీ, ఒకే జండా, ఒకే నాయకత్వం క్రిందవున్న వారిని బలపరుస్తే సుస్థిర ప్రభుత్వం ఏర్పడవచ్చునని ఓటర్లు భావించి రాజీవ్‌కు పట్టం గట్టారు. అదే విధంగా తెలుగుదేశంలో యన్. టి. ఆర్. కు విజయం చేకూర్చారు. ఓటర్లు ఆలోచించి చేయవలసిందే చేసారు. ప్రస్తుత పరిస్థితులలో ఇంతకన్నా ఓటర్లకు దిక్కు తోచ లేదు.

అనుభవం లేకపోయినా అదృష్టదేవత వరించిన నేతనే దేశాన్ని ఎటువైపుకు తీసుకుని వెళ్ళు తారో వేచి చూడాలి. ప్రస్తుతస్థితిలో యింత కన్నా ఆశించేదిలేదు. చేయగలిగింది కూడా ఏమీలేదు.

'సమదర్శి'

# ఇది ఎలక్షనా? ఓటర్ల కలక్షనా? లేక రిఫరెండమా?

రాజకీయ అశనిపాతకంగానే, రాజకీయ ప్రళయంలో పడింది దేశం. తుఫాను, ఉప్పెన కలిసి మీదపడి రాజకీయరంగము, ప్రజాస్వామిక సంతులనము అయిపు ఆనవాలు లేకుండా కొట్టుకుపోయినట్లయింది. వదిలిపోవా లనుకున్న కాంగ్రెసు మరింత పదిలంగా పార్లమెంటులో మేలుచేసింది. మిశ్రమ ప్రభుత్వమిస్తామన్న ప్రతిపక్షాలు పార్లమెంటులో (దాదాపు) నామరూపాల్లేకుండా పోయినాయి. ఈ పెనుతుఫానులో రాజీవ్‌గాంధీ కొండకొమ్ము మీద తేలాడు. "నా ఓటు ఎంతపనిచేసింది" అని విస్తుపోతున్నాడు సామాన్య ఓటరు. ప్రతిపక్షంలేని పార్లమెంటులో సంతులనం ఎట్లా? అని చూస్తున్నాడు ఆలోచనాపరుడు.

ఇన్‌స్టెంట్ కాఫీలో వొచ్చేడు పంచదార (శాకరిన్) దిమ్మరించినట్లయింది. అమ్మ పోగానే అందలమెక్కించబడ్డ ఇన్‌స్టెంట్ ప్రధాని ఈ ప్రజాస్వామిక పంచదారతో ప్రజాస్వామిక ప్రధాని అయి కూర్చున్నాడు. ఆయన్ను అందరూ అభినందించడం లాంఛనం. ఆ లాంఛనం విలిపి ఉంచుదాం. గతంలేని మనిషి ఏమిచేస్తాడో, ఏమి చేయగలడో, ఏమి చేయలేడో అప్రమత్తంగా వేచిచూడడం మంచిది. అభినందనలుగాని, అభిశంసనలుగాని పనితీరును బట్టి ఎప్పుడయినా ఇచ్చుకోవచ్చు.

ఏమిటీ ఎలా జరిగిందీ వింత అని విశ్లేషణ చేసుకుంటున్నాయి అన్ని పార్టీలు. కాంగ్రెస్ ఇంతగా ఎలా గెలిచింది అనేవారికంటే, ప్రతిపక్షాలు ఇంతగా ఎలా ఓడాయి అని ప్రశ్నించేవారెక్కువగా కనిపిస్తున్నారు. ప్రతిపక్షాల ఓటమికి కారణం అంత వెదకవలసింది లేనేలేదమో! భారతంలో కర్ణుని చావుగురించి ఒక పద్యముంది.

'నీచేతను, నాచేతను వరమడిగిన.

అవన్నీ నేటి ప్రతిపక్షాలకు అతికినట్లు సరిపోతాం. అర్జునుణ్ణి మించినవాదే అయినా. కర్ణుడికి అన్నీ శాపాలే. ఆ శాపాలతోనే పోయినాడు కర్ణుడు. అర్జునుడు ఒక విధంగా కర్ణుడికి సాటిరాకపోయినా, అర్జునుడికి అన్నీ వరాలే. ఆ వరాలతోనే. నిలిచాడు అని చెప్తారు కొందరు. రాజీవ్‌కుకూడా వర్తించే మాట ఇది అనాలి.

ఇంత పెద్ద సంస్కృతి, చరిత్ర కలిగిన ఈ మహత్తర దేశానికి—"నాకు దేశమూ వద్దూ, రాజకీయాలు వద్దూ, విమానాలు తోలుకుంటానని అన్ని ఆశయాలకు, అన్ని త్యాగాలకు దూరంగా బ్రతుకుతాను"అన్న మనిషి ఉటిప్రడియంగా ప్రధాని అయిపోవడం ప్రపంచ ప్రజాస్వామిక చరిత్రలో పెద్ద విడ్డూరమే. గిన్నీస్ బుక్‌లో ఎక్కవల్సిన విడ్డూరం ఇది. ఈ జాతికి, ఈ ప్రజాస్వామ్యానికి ఇది ఘనత అనాలా? అవమానం అనాలా?

భర్తృహరి సుభాషితంలోని "ఆకాశంబుననుండి, శంభుని శిరంబు......అనే పద్యం చదువుకుంటూ ఆశ్చర్యపోతున్నారు కొందరు. "ఈ ప్రజలు పట్టి మూరులు. బానిసలుగా ఉండదగినవారు" అన్నాడట సొంత పార్టీ ఓడిపోయిన ఒక ప్రతిపక్ష నాయకుడు!" ప్రజల విజ్ఞతకు ఇదంతా పెద్ద చిహ్నం" అంటున్నారు గెల్చి కేరింతలు కొడుతున్నవారు. ప్రజలు విజ్ఞులూకాదు, మూర్ఖులూకాదు. కేవలం ప్రజలే. దైవసమానులు. దైవం కల్గించిన ప్రేరణతో తోచిన పనిచేసారు.

ఐతే మనమున్నది ఐహిక జీవనంగనుక కొంత ఐహిక, రాజకీయ విశ్లేషణ జరుపుకోవడం, అవసర జాగ్రత్తలు పడడం, అప్రమత్తంగా ఈ కొత్తమేళం ప్రభుత్వంవల్ల ఏమూల ఏ మేలు జరుగుతున్నదోనని వెయ్యికళ్ళతో కనిపెట్టుకు చూచుకొనడం కర్తవ్యం. ఇది వరకు ఆ పనికి ప్రతిపక్షమైనా ఉండేది. ఇప్పుడదీ లేదు. లోగడ పత్రికలు ఆ పని చేసేవి. ఇప్పుడు దాని విషయం ఎంత తక్కువగా అనుకుంటే అంత నయం అనుకునే స్థితి. అందుచేత మళ్ళీ ప్రజలే అన్నివైపులా పహరా కాచుకోవాలి.

ప్రజలేదో సరిగా పనిచేయలేదనేవారు ఒక ప్రశ్నకు సమాధానం చెప్పాలి. ప్రజలు ఏమి చూచి ప్రతిపక్షాలకు ఓటు వేయాలి ? పోలింగురోజునకూడా ప్రతిపక్షాల మధ్య పేచీలు తెమలలేదు. ఒక్క జండా, ఒక్క కార్యక్రమం, ఒక్క నాయకుడు, ఒక్క గుర్తు-ఇవేమి లేకపోతే మానె-ఉత్తేజమిచ్చే ఒక్క నినాదం, ఒక్క లక్ష్యం, ఒక్క ఆశయం ఐనా పలకలేకపోయినాసరే ; అదేదీ లేకుండా మిశ్రమ ప్రభుత్వం స్థాపిస్తామంటే ఏ విధంగా వారిని నమ్మకోవాలి?

ఇక రెండవ ప్రక్క ఎవరెన్ని అన్నా ఒక్క మాట, ఒక్క పార్టీ, ఒక్క జండా, ఒక్క నేత కనిపిస్తున్నారు. తెరవెనుక కథలు, కారణాలు, పూర్వచరిత్రలు ఎన్నయినా, తెరమీద ఒక దృశ్యమేదో కనిపిస్తోంది. ఈ స్థితిలో ప్రజలు ఏమి చేస్తారు ? ఏమి చేయాలి ? అదే చేసారనుకోవాలి.

అప్పటికీ కొంత ఆధారం కనిపించిన చోట్ల-ఆంధ్రప్రదేశ్, పశ్చిమబెంగాల్ వగైరాల్లో సాధ్యమైనంతవరకు కాంగ్రెసును వదలించుకోవాలనే చూచారు. దేశం మొత్తం మీద చూచినా ఓటర్లు కాంగ్రెసుకన్నా ప్రతిపక్షాలవైపే మొగ్గు చూపారు. కాంగ్రెసుకు 49.6 శాతం ఓట్లు పడితే ప్రతిపక్షాలకు 50.4 శాతం ఓట్లు పడ్డాయి. మనది దామేషా పద్ధతి ప్రజాస్వామ్యం కాదు. దామాషా పద్ధతిలో చూస్తే, లోక్‌సభలో ప్రభుత్వ, ప్రతిపక్షాలు సమ ఉజ్జీలుగా నిలిచేందుకు వీలుగానే ఓట్లు పడ్డాయి. మన ప్రస్తుత మెజారిటీ పద్ధతిలో రెండో స్థానంలోని ఓటుకు విలువలేదు. అందువల్ల 50.4 శాతం ఓట్లు మురిగిపోయినంతపని ఐంది. 49.6 శాతం ఓట్లతో కాంగ్రెసుకు ఐదింట నాల్గు వంతులు సీట్లు లభించినట్లయింది. దీనికి ప్రజలేమి చేయాలి ?

కాంగ్రెసు ఘోరంగా రిగ్గింగ్ జరిపిందని, ధనశక్తిని' అధికార శక్తిని దిమ్మరించిందని, గూండాగిరి ప్రయోగించిందని, పైన పక్షివాహన ప్రచారం, క్రింద ప్రతిపక్షాల పాదచారి ప్రచారానికి మధ్య సంతులనం లేదని, కాంగ్రెసు రు 200 కోట్లు ఖర్చు పెట్టగా, మిగిలిన వారంతా కలిసి రు. 100 కోట్లు కూడా ఖర్చుపెట్టలేకపోయినారని, అనేకమైన అంశాలను ప్రతిపక్షాలు, తటస్థులు కొందరు అంటున్నారు. ఇందులో ఏమాత్రం అసత్యం లేకపోవచ్చు. ఈ కాంగ్రెసు ఆనాటి కాంగ్రెసు కానేకాదు. ఒకటి మహాత్మా గాంధీ కాంగ్రెసయితే, ఇది మజేదార్ బ్రాందీ కాంగ్రెసన్నారెవరో. సందేహంలేదు. కాని దేశానికి దీని బెడద తప్పించేందుకు ప్రతిపక్షాలేమి చేసాయని ? ఏమి వ్యూహం చేసాయని?

ప్రతిపక్షాల విమర్శన లటుంచి కాసేపు కాంగ్రెసు చేతను గురించి పరిశీలకులంటున్న కొన్ని అంశాలుకూడా ఆలోచనీయాలు. కాంగ్రెసు "ఐక్యత" సమగ్రత"లను గురించి చేసిన ప్రచారం, దానికి బాగా ఉపకరించిందని చెప్పబడుతోంది. అది చాలావరకు నిజం అయి వుండవచ్చు. "నేనెవరికి ఓటు ఇవ్వాలి" అని బెంబేలు పడ్డ ఓటర్కు అందులో కొంత ఆశ. ఆధారం కనిపించి ఉండవచ్చు. కాని వాస్తవానికి ఆ మాటలు అనే అర్హత కాంగ్రెసుకు ఉందా? ఈ దేశాన్ని ముక్క-చెక్కలు చేసింది కాంగ్రెసు. ఆ తరువాత చైనా, పాకిస్థాన్‌లు దురాక్రమణను నిరోధించలేకపోయింది కాంగ్రెసు. వివిధ ప్రాంతాలలో ఏర్పాటు వాదాలకు నీరుపోసింది కాంగ్రెసు. పంజాబులో ఉగ్రవాదులకు ఊతనిచ్చింది కాంగ్రెసు మైనారిటీలు, మెజారిటీలు అంటూ సమాజం మొత్తాన్ని నిలువునా, అడ్డంగా కోసి,

సమిష్టి దేశచింతనకు ఆస్కారం లేకుండా చేసింది కాంగ్రెసు. అటువంటి కాంగ్రెసుకు ఐక్యత, సమగ్రతలను గురించి మాట్లాడే నైతిక హక్కులేదు. నిజానికి ఐక్యత, సమగ్రత ఎన్నికల ప్రశ్న అవుతుందా? అసలు ఏ పార్టీ అయినా వాటిని వద్దన్నాయా ? అయినప్పటికి కాంగ్రెసు ఆ నినాదాన్ని పదేపదే ఎన్నికలలో వల్లించింది. ఇందిరా గాంధీని ఎవరో మూర్ఖంగా చంపినదానిని ఆసరాగా తీసుకొని ఎన్నికలో కాంగ్రెసు ప్రయోజనాన్ని పొందింది.

ఏమైనా, ఈ ఎన్నికలు దేశానికి ఒక పెద్ద కుదుపు. అసలిది ఎలక్షనా ? లేక ఓటర్ల కలక్షనా ? లేక రిఫరెండమా? మూకఉమ్మడి బండపద్ధతి ప్రచారాల్తో, రాక్షస శక్తి ఆర్భాటాలతో ఓట్లు ప్రోగుచేసుకోవడం తప్ప-ఓటరు ఆల చన, అభ్యర్థి మంచిచెడ్డల ప్రసక్తి ఉందా ! రాజీవ్ కావాలా? వద్దా? ఐక్యత కావాలా? వద్దా?ఈ మాదిరి బండ ప్రశ్నలతో జరిగిన తతంగం రిఫరెండం అవుతుందేమో గాని, ఆదర్శప్రాయమైన ఎలక్షన్ అవుతుందా?

తతంగం ఎలా జరిగినా మనం రాజ్యాంగబద్ధులం. క్రమంగా ప్రజాస్వామ్యాన్ని స్థిరపరచుకొన గోరుతున్నాం. ఇది ఒక నిరంతర కృషి. నిరంతర సాధన. నిరంతర పోరాటం. ఈ పార్లమెంటు ఎన్నికలతోనే దేశచరిత్ర ముగింపయిపోదు. అడుగడుగునా ఎన్నికలు, ఆరోపణలు పోరాటాలు ఎలాగూ ఉన్నాయి.ఉదాత్త చింతనతో, విజ్ఞతతో ముందుకు సాగిపోవాలి. ప్రజాస్వామ్య వ్యవస్థను రక్షించుకోగలగాలి. ఇదే ఈనాటి కర్తవ్యం.

—'దేశవాణి'

## యవనిక

28 పేజీ ఫస్ట్ కాలమ్ 3 వలైన్. (లాస్ట్ నించి)

"పోనీ ఒకటి అడుగుతాను చెప్తావా?" అన్నాడు రాఘవ.

"ఏమిటి? "

"నువ్వింక జీవితంలో పెళ్ళి చేసుకోవా? "

2వ కాలం. 17వ లైన్

"మేం రేపు కాశ్మీర్? "వెళ్తాం "

'ఎందుకు ?' గభాల్న అంది చందన.

"నువ్వు మురళీని చేసుకోవద్దు ! కానీ విరోషత్వం వాళ్ళకి తెలియాలి ! ఆ ముసలాయన నిన్ను కోడలిగా చేసుకోనందుకు కుళ్ళి కుళ్ళి ఏడవాలి! ఆవేశంగా అన్నాడు రాఘవ.

దానివల్ల మనకి ఒరిగేదేవిఁటి మావయ్యా?నిర్లిప్తంగా అంది చందన.

"వాళ్ళ తప్పు వాళ్ళకి తెలిసి రావడమే !

'ఊ! సరే! కానీ! ' నిట్టూరుస్తూ అంది చందన.

పైమార్పును గమనించి, యవనిక 'సీరియల్' చదువుకో ప్రార్థన.

ఆ ఫొటోలో ఓ పెద్ద మంచంమీద బాబు, బాబు చెంపమీద పెదవులాడి హత్తుకు పడుకున్న చందన!

మావయ్యా! ఏమిటిది?'' ఒణికిపోతూ అంది చందన. అతనూ దాదాపు అదే స్థితిలో ఉన్నాడు.

''ఇందులో ఉన్నది...నువ్వేకదూ?'' అన్నాడు మెల్లగా.

''అలాగే ఉంది!...కానీ ..'' దుఃఖంతో చందన గొంతు పూడిపోయింది.

''ఇదేదో వింతగా ఉంది...నీకు తెలియకుండానే వీడు నీ కౌగిల్లోకి రావటం, అది ఎవరో ఫొటో తియ్యడం, అది వీడి చేతికిచ్చి పంపడం ఓహ్!...మతిపోతోంది!'' అన్నాడు రాఘవ. అతని మనసంతా అయోమయంగా అయిపోయింది.




''ఎవరో ఏదో పెద్ద ప్లానే వేశారు మావయ్యా! నన్ను వీధికి లాగాలని...ఇలాంటి సీన్ క్రియేట్ చేశారు!'' కాస్త ఆవేశంగా అంది చందన.

''అదేం కాదు!...మా అమ్మకోసం నేను రోజూ గొడవ చేస్తున్నాను కదా! అందుకే అంకుల్ ఈ ఫొటో తీసి నాకిచ్చి చూసుకుంటూండమన్నారు!'' అన్నాడు బాబు.

''మరైతే ఇది చూసుకుంటూండక ఇక్కడ కెందుకు అఘోరించావ్? అరిచింది చందన.

''మరి మా అమ్మ రెండో పెళ్ళి చేసుకుంటోందిగా!'' తాపీగా అన్నాడు బాబు.

''మీ అమ్మ రెండో పెళ్ళి చేసుకుంటోందా?'' ఆశ్చర్యంగా అన్నాడు రాఘవ.

''అవును!...అందుకే జాలేసి నన్నిక్కడికి తీసుకొచ్చాడు అంకుల్!....అమ్మలుగానీ, నాన్నలుగానీ మళ్ళీ పెళ్ళి చేసుకుంటే పిల్లల్ని అస్సలు చూడర్టగా అంకుల్ చెప్పార్లే!....''

"అంకుల్! అంకుల్! అంకుల్! ఎవడా అంకుల్?" ఆవేశంతో వాడ్ని పట్టుకొని గుంజింది చందన.

వాడేం బెదరలేదు.

అంకులంటే "మా అంకులే! చాలా మంచాయన పాపం! నాకు బోలెడు చాక్లేట్లు, బిస్కెట్లు కొనిచ్చాడు!" అన్నాడు సంతోషంగా.

"ఇప్పుడా అంకుల్ ఎక్కడున్నాడు?" తన్నుకొస్తున్న కోపాన్ని తనలోనే దాచుకుంటూ అన్నాడు రాఘవ.

"తెలియదు...నన్ను ఇక్కడికి తీసుకొచ్చి—

"అదిగో మీ అమ్మ పెళ్ళయిపోతోంది. వెళ్ళి పెళ్ళి ఆపించు!...అని వెళ్ళిపోయాడు. కానీ...నన్ను చూడగానే మీరంతా పోట్లాడుకున్నారు! ఓ తాతయ్య తిడితే పాపం! ఇంకో తాతయ్య పడిపోయారు... కానీ మీ నాన్న కూడా వస్తారని చెప్పాడు అంకుల్....కానీ...ఎందుకు రాలేదు!" ఆలోచనలో పడ్డాడు బాబు.

"మీనాన్న వస్తే వెళ్ళిపోతావా? ఆశగా అంది చందన.

"ఆ! వెళ్ళిపోతాను! కానీ, ఒక్కడ్ని కాదు! నీతో కలిసి" బాబు తియ్యగా నవ్వాడు.

స్మ!' అనుకుంది చందన.

మూడు రోజులు గడిచిపోయాయి.

# "యవనిక"

జరిగిన కథ :

శాంతారామ్ గారమ్మాయి చందన పెళ్ళి అట్టహాసంగా జరుగుతూండగా ఓ ఆరేళ్ళ పసివాడు చందనని చూసి "అమ్మా!" అని పిలుస్తాడు. మగపెళ్ళివారి అపోహ మూలంగా పెళ్ళి ఆగిపోతుంది. శాంతారామ్గారికి హార్ట్ ఎటాక్ వస్తుంది.

దీని కంతటికి కారణభూతుడైన బాబుని దండించబోయిన చందన, ఆమె మేనమామ రాఘవ బాబు చూపించిన ఫొటో చూసి...నిర్ఘాంతపోతారు.

(ఇక చదవండి)

శాంతారామ్గారి పరిస్థితి కాస్త మెరుగైంది కానీ జరిగిన అవమానాన్ని ఇంట్లో ఎవ్వరూ మర్చిపోలేక పోతున్నారు.

ఇవన్నీ గాక మరో సమస్య!

బాబు సరిగ్గా తిండి తినడంలేదు. ఎంతసేపూ, నాన్న, నాన్న అంటూ గొడవ చేస్తున్నాడు. విసుక్కుంటే ఏడుస్తున్నాడు.

మావయ్యా! ఈ గోల మనకెందుకు పోలీస్టేషన్లో ఇచ్చేద్దామా! అంతా వాళ్ళేచూసుకుంటారు! అంది చందన విసుగ్గా.

"ఒద్దు! రెండురోజులు గడిస్తే తానే అన్ని వివరంగా చెప్తాడు!" పోలీసులంటే మళ్ళీ బోలెడు తతంగం. అందుకే నేనే నిర్ణయానికొచ్చాను!" అన్నాడు రాఘవ.

"ఏమిటి?"

"బాబుచేత మెల్లగా బుజ్జగించి నువ్వు కొన్ని వివరాలు రాబట్టు. ఈలోగా నేనూ, మురళీ కొన్ని వివరాలను సేకరిస్తాం!"

"మురళా!" కళ్ళు చిట్లించింది చందన.

"అవును చందనా! జరిగిందానికి అతనెంతో బాధపడుతున్నాడు! వాళ్ళ నాన్నతో పెద్దపోట్లాటకూడా పెట్టుకున్నాడు!

ఓ! నువ్వు చూశావా?

"లేదు అతనే చెప్పాడు!"

"నువ్వు వెంటనే నమ్మేశావ్!"

"లేదు చందనా! అతనికి నీ దగ్గరికి రావటానికి మొహం చెల్లడంలేదు కానీ లేకపోతే నీకే చెప్పేవాడు క్షమాపణ. అసలారోజే తండ్రిని కాదని నీ మెళ్ళో తాళి కట్టనందుకిపుడు బాధపడుతున్నాడు...నిజంగా ఇపుడతన్ని చూస్తే...నాకేకాదు నీకుకూడా బాధ కలుగుతుంది. మనిషి చిక్కిపోయాడు! నల్లబడ్డాడు!" బాధగా అన్నాడు రాఘవ.

చందన మాట్లాడలేదు. అలా మౌనంగా ఉండి పోయింది.

"నిజంగా నిన్నతను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నాట్టు!" ఏదో ఆలోచిస్తూ అన్నాడు రాఘవ.

"అలాంటప్పుడు నా మనసేమిటో, నేనేమిటో కూడా తెలియాలిగా?" అక్కసుగా అంది చందన.

"తెలుసు!"

"చందనా!" గంభీరంగా అన్నాడు రాఘవ.

"ఏమిటి మామయ్యా?"

"నువ్వు బాధపడనంటే ఓ మాట చెప్తాను!"

"చెప్పు!"

"ఆరేళ్ళక్రితం నీకు సుస్తీ చేసింది గుర్తుందా!" మెల్లగా అన్నాడతను.

"అవును! అయితే?"



"అలాంటప్పుడు....తండ్రి లెమ్మనగానే గంగిరెద్దులా తలవూప పీటలమీంచి లేచి పోయావెందుకు? తండ్రికి నచ్చ చెప్పవచ్చుగా?"

"చెప్పాడు!"

"ఎప్పుడు?"

"ఇంటి దగ్గర!"

"ఓ! ఇంటి దగ్గరా? రిజర్వ్ బ్యాంకులో బోలెడు డబ్బుంది! మనకేమిటి లాభం?" హేళనగా అంది చందన.

"అప్పుడు బావ నిన్ను కాశ్మీరు తీసికెళ్ళారు..."

"ఊ!"

"అప్పుడు నువ్వక్కడ దాదాపు ఆర్నెల్లపాటున్నావ్!"

"అవును! గాలి మార్పుకోసం మా డాక్టరు చెప్తే..."

"కానీ... అదికూడా మురళి తండ్రి మనసులో నాటుకు పోయింది."

"దానికీ దీనికీ సంబంధం ఏమిటి మామయ్యా? చిరాగ్గా అంది చందన.

"ఉందనే అంటున్నాడాయన."

"ఎవరు?

"అదే మురళి తండ్రి."

"అంటే?" అర్థంకానట్టు చూసింది చందన.

"బాధ పడవుగా?"

"ఉహూ! చెప్పు."

"అప్పుడు నిజంగా నీకే సుస్తీ లేదనీ, ఎవరివల్లో నీకు నెల తప్పిందనీ, డాక్టర్ దగ్గరికి తీసికెళ్తే అబార్షన్ చేయిస్తే ప్రమాదమని ఆవిడ చెప్పిందనీ అందుకే అక్కా బావా నీకు ఏదో సుస్తీ చేసిందని చెప్పి కాశ్మీర్ తీసికెళ్ళి అక్కడ ఓ లేడి డాక్టర్ దగ్గర పురుడు....అదీ...కానిచ్చి

"స్టాపిట్!" అరిచింది చందన.

"అయామ్ సారీ! ఈ మాటన్నది నేనుకాదు చందనా, ఆ మురళి తండ్రి." భారంగా అన్నాడు రాఘవ. కుప్ప కూలిపోయింది చందన.

... ....

మరో నాలుగు రోజులు గడిచిపోయాయి.

శాంతారామ్‌గార్ని డాక్టర్లు విశ్రాంతి తీసుకోమనడంతో తప్పని సరిగా ఇంట్లో వుండిపోయాడాయన.

ఎప్పుడూ హుందాగా, ఉల్లాసంగా తిరిగే ఆయన హటాత్తుగా ఓ దీర్ఘకాల రోగిలా అయిపోయాడు. ఆయన శరీరారోగ్యం కన్నా మానసికారోగ్యమే బాగా దెబ్బతింది. భార్య, కూతురు ఆయన్ని మామూలు వ్యక్తిగా చేయడానికి విశ్వ ప్రయత్నాలు చేస్తున్నారు. కాని వుత్సాహం నటిస్తున్నారు.

ఆ రోజు మధ్యాహ్నం చందన, రాఘవ, దేవకి, ఒక గదిలో చేరి ఏదో రహస్యాలోచన చేస్తున్నారు.

శాంతారామ్ తన గదిలో పడుకొని పైకి చూస్తూ ఏదో దీర్ఘంగా ఆలోచిస్తున్నాడు.

"తాతయ్యా!"

తృళ్ళిపడి చూశాడాయన.

ఎదురుగా బాబు!

చిరునవ్వుతో ఆయనకేసి చూస్తున్నాడు.

మొహం చిట్లించాడు శాంతారామ్.

"నువ్వు... నువ్వింకా ఇక్కడే వున్నావా?" అన్నాడు ఆశ్చర్యంగా. వాడి మాట అసలాయన దగ్గర తేవడం లేదెవరూ.

"అవును తాతయ్యా! ఇక్కడే వున్నాను: ఎంత ఏడ్చినా నన్ను ఇంటికి తీసికెళ్ళడం లేదు! నువ్వు తీసి కెళ్తావేమో అని నిన్ను వెతుక్కుంటూ ఇక్కడికొచ్చాను!" అమాయకంగా అన్నాడు బాబు.

"ఇలారా!" అన్నట్టు చెయ్యూపాడు శాంతారామ్. బాబు మెల్లగా దగ్గరి కొచ్చాడు.

"కుర్చో!" అంటూ స్టూల్ చూపించాడాయన. బాబు స్టూల్ మీద పొందిగ్గా కూర్చున్నాడు.

"నీ పేరేమిటి?" వాడికేసి పరిశీలనగా చూస్తూ అన్నాడు శాంతారామ్. బాబు కళ్ళు వింతగా మెరుస్తు న్నాయి. ఎంత విసుక్కుందామన్నా అతనిమీద కోపం రావడంలేదు శాంతారామ్‌కి.

"బాబు!"

"ఇక్కడికెలా వచ్చావ్?"

"అంకుల్ తీసుకొచ్చారు!"

"ఎందుకు?"

"అమ్మకోసం!" అంటూ చందనా వాళ్ళకి చెప్పినట్టే కొన్ని వివరాలు చెప్పాడు ఓపిగ్గా.

"అమ్మ కావాలని వచ్చినవాడివి మరి వెళ్ళిపోతా నంటావేం?" కుతూహలంగా అన్నాడు శాంతారామ్.

"నాకు అమ్మా నాన్న ఇద్దరూ కావాలి!"

"మరి మీ నాన్నెక్కడుంటాడో మాకు తెలియదుగా నువ్వు చెప్పు తీసికెళ్తాం."

"చెప్పానుగా!...మా నాన్న పేరు జయంత్. తెల్లగా,

పొడుగ్గా...అచ్చం నాలాగే వుంటారు! రకరకాల కార్లలో తిరుగుతూంటారు...చెప్పుకు పోతున్నాడు బాబు.

"రకరకాల కార్లలోనా?" మధ్యలోనే ఆపాడు శాంతారామ్.

"అవును,"

"మీకు చాలా కార్లున్నాయా?"

"ఆ! బోల్డు!"

"మరి మీ ఇల్లు ఎలా వుంటుంది?

"పెద్దగా ఉంటుంది. మా ఇంటి గేట్లో ఘూర్ఖా కూడా ఉంటాడు!" కళ్ళు పెద్దవిచేసి చెప్పాడు బాబు.

బాబు స్థితిగతుల్ని భేరీజు వెయ్యడానికన్నట్టు కాసేపు మౌనం వహించాడాయన.

"ఇంకా పెద్దతోట కూడా వుంది!....మా తోటలో బోల్డు చెట్లున్నాయి! మామిడి చెట్లు కూడా వున్నాయి! తాతయ్యా! మామిడికాయ ముక్కల్లో ఉప్పు నంచుకు తింటే భలే బావుంటుంది. నువ్వెప్పుడైనా తిన్నావా?" ఉత్సాహంగా అడిగాడు బాబు.

"ఊహూ!" నవ్వుతూ తలతిప్పాడు శాంతారామ్.

"తిన్లేదూ?...అయితే మా ఇంటికిరా! నీకు బోల్డు మామిడికాయలు కోయించి పెడతాను. మా మాలి చాలా మంచివాడు! పాపం! ఎన్ని కాయలు కావాలన్నా కోసి పెడతాడు! అన్నాడు బాబు.

"అంటే బాబు కలవారి బిడ్డేనన్నమాట!....అలాంటపుడు పిల్లాడు కనిపించకపోతే ఇన్నాళ్ళూ తమకి పట్టనట్టు ఎలా ఊరుకున్నారు?...ఏ పేపర్లో వేయించడమో, పోలీస్ కంప్లయింటులాంటి దివ్వడమో ఎందుకు చెయ్యి చెయ్యలేదు? ఒకవేళ...వేశారేమో...తనే చూడలేదేమో! అయినా....ఇంతమంది మిస్సవుతామా!" ఆలోచనలో పడ్డాడు శాంతారామ్.

"తాతయ్యా!" అన్నాడు బాబు ఆయన మౌనం నచ్చనట్టు.

శాంతారామ్‌కి బాబుమీద కోపం మంచులా కరిగి పోయింది. వాణ్ణి తన పక్కలో కూర్చోపెట్టుకుని కబుర్లు మొదలుపెట్టాడు.

"తాతయ్యా! నువ్వు మంచివాడివి!" హటాత్తుగా అన్నాడు బాబు.

"ఏం?"

"నన్ను అమ్మ, అంకుల్ ఒకటే విసుక్కుంటున్నారు! మాట్లాడితే నోరు మూసుకో! అని గదుముతున్నారు!"

"అమ్మా, అంకులూనా?" ఆశ్చర్యంగా అన్నా శాంతారామ్.

"అదే....ఆవిడే!...టేబిల్‌మీదున్న చందన ఫొటో కేసి చూపిస్తూ నవ్వాడు బాబు.

"ఓ శాంతారామ్‌కూడా నవ్వేశాడు.

అప్పుడే గదిలో అడుగు పెట్టిన చందన ఆ దృశ్యం చూసి నిర్ఘాంతపోయింది. గబాల్న బాబు దాగ్గరకొచ్చి—

"ఇక్కడి కెందుకొచ్చావ్? అంది కఠినంగా.

తాతయ్యతో కబుర్లు చెబుతున్నాను." శాంతారామ్ మెడచుట్టూ చేతులువేసి అన్నాడు బాబు.

మరింత తెల్లబోయింది చందన.

మీ ఇద్దరికీ ఇంత స్నేహం ఎలా అయింది? అన్నట్టు తండ్రికేసి చూసింది తీక్షణంగా.

"పోన్లెమ్మా! పసివాడు!" నవ్వుతూ అన్నాడాయన.

"వీడు పసివాడా?" కోపంగా అంది చందన.

"కాదా మరి! చూడు! నీకంటే ఎంత చిన్నగా వున్నానో!" లేచి ఆమె పక్కగా నిల్చుని అన్నాడు బాబు. శాంతారామ్ నవ్వాడు.

చందన మాత్రంనవ్వలేదు. మరింత తీక్షణంగాచూస్తూ.

"జరిగింది చాలుగానీ ముందిక్కడ్నించి నీ గదిలోకి వెళ్ళు!" అంది.

చూశావా తాతయ్యా!...నేను చెప్పలేదూ? అమ్మకి నామీద ఒకటే కోపం! దిగులుగా అన్నాడు బాబు.

"పటవ్!" ఆవేశంగా అరిచింది చందన.

''ష్! చందా!....పసివాడితో ఏమిటమ్మా! ఏదో తల్లి కోసం బెంగపడ్డాడు. అతని తల్లి నీలా ఉండిఉంటుంది. అందుకే నిన్నుచూసి వాళ్ళమ్మను కుంటున్నాడు! పాపం! అయినా అమ్మ అన్నంత మాత్రాన నువ్వు అమ్మవై పోతావా!...ఆ అంతమాత్రాన...ఇంక జరిగే ఘోరమూ లేదు. జరగవల్సిందేదో మొన్నే జరిగిపోయింది!'' వాడి తల నిమురుతూ అదోలా అన్నాడు శాంతారామ్.

''అదికాదు నాన్నా! వీడి మూలంగా నా పెళ్ళి...'' దుఃఖంతో ఆమెకి మాట రాలేదు.

''అది వీడి తప్పుకాదు చందా! పసివాడి మాటలునమ్మి పీటల మీదనుంచి లేచిపోయారే వాళ్ళది తప్పు! ఏ శిక్షైనా వేస్తే వాళ్ళకెయ్యాలి! కానీ...నేనొకందుకు సంతోషిస్తు న్నానమ్మా!...ఇలాంటి సంబంధం తప్పిపోయినందుకు!.. ఇలాంటి కుసంస్కారులతో బంధుత్వం కలుపుకో నందుకు!'' గంభీరంగా అన్నాడు శాంతారామ్.

అది ఆవేదనో, ఆవేశమో అర్థం కాలేదు చందనకి. ఆయన కళ్ళలోకి చూస్తూ అలాగే ఉండిపోయింది.

"తాతయ్యా! నేను నీ దగ్గరే పడుకుంటాను!'' అన్నాడు బాబు ఆయన దగ్గరగా జరుగుతూ.

''అలాగే....నాన్నా!" అన్నాడు శాంతారామ్ బాబుని పొదివి పట్టుకుని.

"భలే మనవడు దొరికాడు!" విషయం విన్న దేవకి నవ్వుతూ వచ్చింది.

ఆవిడకి భర్త మొహంలో నవ్వు చూసేసరికి ఎక్కడ లేని ఉత్సాహం వచ్చింది.

''ఎలా అయితేనేం ఆయన పూర్వపు మనిషి కావాలి!'' అనుకుంది తృప్తిగా.

— —

విషయమంతా చందన నోటవిన్న రాఘవ తెల్ల బోయాడు!'' చిత్రంగా ఉందే!....వాడి మీద బావకి పిచ్చి కోపం ఉంటుందనుకున్నాను. ఫ్రెండయిపోయాడే! ఫరవా లేదు!'' అన్నాడు తేలిగ్గా నిట్టూరుస్తూ.

''అది సరే!—ఇట్లా ఎన్నాళ్ళు?'' విసుగ్గా అంది చందన.

''అంటే?''

''అదే ఈ మనవడు గారింకా ఇక్కడ ఎన్నాళ్ళు తిష్టవేస్తాడూ అని!''

చెప్తాను! రేపు నేనూ, మురళీ, కాశ్మీర్ వెళ్తున్నాం! రాగానే అన్నీ మంచు విడినట్టు విడిపోతాయి. అప్పుడు వీడ్ని తేలిగ్గా ఒదిలించుకోవచ్చు!'' అన్నాడు రాఘవ.

''కాశ్మీర్ వెళ్తున్నారా? ఎందుకు?'' మొహం చిట్లించింది చందన.

''అక్కడ నిన్ను ట్రీట్ చేసిన లేడీ డాక్టర్ని కలవాలి!''

''ఎందుకు?'' తెల్లబోయింది చందన.

''ఆవిడ దగ్గర్నించి నీ జబ్బు తాలూకు కాయితాలు తెచ్చి—తండ్రి మొహాన కొడతానన్నాడు మురళి!''

''కొడితే?''

''ఆయన పెళ్ళికి చచ్చినట్టు ఒప్పుకుంటాడు!''కోపంగా అన్నాడు రాఘవ.

''మామయ్యా! నన్ను గురించి నువ్వే మనుకుంటు న్నావ్!'' గంభీరంగా అంది చందన.

కంగారుగా చూశాడు రాఘవ.



"అంటే నేను కీలుబొమ్మలా కన్పిస్తున్నానా మీ కళ్ళకి?" కోపంతో చందన కళ్ళు ఎర్రబడ్డాయి.

"అదికాదు చందనా ఆయనంగీకరిస్తే

"ఆయనంగీకరిస్తేచాలా ? నేనంగీకరించక్కర్లేదా?

"చందనా తెల్లబోయాడు రాఘవ.

"అవును మామయ్యా నేను మనిషినే మర బొమ్మను కాదు! ఎవరాడిస్తే అలా ఆడ్డానికి! నాకూ మనసుంది అంటే"?

"ఇప్పుడు వాళ్ళు చేసుకోవడానికి ముందుకొచ్చినా ఆ ఇంటి కోడలవడానికి నేను సిద్ధంగా లేను! ఆవేశంగా అంది చందన.

"అయితే నువ్వు మురళిని మర్చిపోతావా? ఆశ్చర్యంగా చూశాడు రాఘవ.

"ఆ!"

"చందనా ! "

"అవును మామయ్యా! నమ్మడం లేదు కదూ ? నేనతన్ని ఇవాళ మర్చిపోలేదు ఎప్పుడైతే నన్ను నలుగురి లో అనుమానించి అవమానించాడో ఆనాడే నేనతన్ని మర్చిపోయాను అంతే మామయ్యా! అవమానాలూ అనుమానాలూ తేలిగ్గా తీసిపారేసి మగాడికి దాసోహం అవడానికి ఇది త్రేతా యుగము కాదూ నేను సీతనూ కాను సీరియస్‌గా అంది చందన.

"అదికాదు చందనా! తొందర పడకు! అతన్ని నువ్వు ప్రేమించావ్! అతనూ నిన్ను ప్రేమించాడు!

"కాదు మామయ్యా అలాఅని భ్రమపడ్డామంతే!"

"నా మాటవిను చందనా!

ప్లీజ్! మామయ్యా! ఇదితప్ప ఇంకేదైనా మాట్లాడు!

పోనీ ఒక్కటడుగుతాను చెప్తావా "అన్నాడు రాఘవ ఏమిటి?"

"నువ్వింక జీవితంలో పెళ్ళే చేసుకోవా"

"అని ఎవరన్నారు? ఎదురు ప్రశ్న వేసింది చందన.

"కానీ"

"నీకా అనుమానం అక్కర్లేదు మామయ్యా! నేను తప్పకుండా పెళ్ళిచేసుకుంటాను! నన్ను నన్నుగా చూసి నాడబ్బుకి కాకుండా నాకు తాళికట్టే మగాడు కనిపించి నప్పుడు. భార్యకూ-డా ఓ మనసుంటుంది. ఆమనసుకి బాధకలిగితే జీవితమే ఓ నరకం అయిపోతుంది! అని నమ్మే మగాడు తటస్థ పడినప్పుడు తప్పకుండా చేసు కుంటాను. అంది చందన.రాఘవ మొహంకాస్త తేరుకుంది

"అమ్మయ్య నిజంగా నువ్వెక్కడ పెళ్ళి వద్దంటావో అక్కాబావా ఎక్కడ కృంగి పోతారో అని హడలిపోతు న్నాను. ఇంక నాకేం బెంగలేదు మనస్ఫూర్తిగా అన్నాడు రాఘవ. చిన్నగా నవ్వింది చందన,

"మరోమాట మెల్లగా అన్నాడతను.

"ఏమిటి? "

"కాదనకూడదు"

"ఉఁహూఁ!"

"మేంరేపు కాశ్మీర్ వెళ్తాం! ఎందుకో? గబాల్న అంది చందన నువ్వు మురళిని చేసుకోవద్దు! కానీ నీ నిర్దోషిత్వం వాళ్ళకి తెలియాలి! ఆ ముసలాయన నిన్ను కోడలిగా చేసుకోనందుకు కుళ్ళికుళ్ళి ఏడవాలి! ఆవేశంగా అన్నాడు రాఘవ

"దానివల్ల మనకొరిగేదేమిటి మామయ్యా? నిర్లిప్తంగా అంది చందన.

"వాళ్ళతప్పువాళ్ళకి తెలిసిరావడమే! ఊఁ సరే! కానీ! నిట్టూరుస్తూ అంది చందన ధాంక్యూ ఆమె చేతులు పట్టుకు ఊపేశాడతను. ఇంతకీ బాబు సంగతేం చేద్దాం? మాట మార్చింది చందన.

"చెప్పు"

"పేపరు ప్రకటన ఇద్దాం! అలాగే! నేను కాశ్మీర్‌నుంచి రాగానే ఫోటోతో సహా వేద్దాం అప్పుడు వాళ్ళవాళ్ళు వరి గెత్తుకొస్తారు అన్నాడు రాఘవలేస్తూ

"అలాగే అన్నాడు తలూపింది చందన. రాఘవ బైటికెళ్ళిపోయాడు. (సశేషం)

# సంబరాల సంక్రాంతి

రచన : "నవ్యకవి" నాదెళ్ళ

మన తెలుగు జాతికి పండగలకు పబ్బాలకు కొదువ లేదు. మనం జరుపుకునే ప్రతి పండుగకు ఒక ప్రాశస్త్యం సంతరించుకొని అనాదిగా అంతరించకుండా సంక్రమిస్తూ మన సంస్కృతీ ప్రతిబింబాలకు ప్రతీకలుగా విలసిల్లే పండుగల్లో విశిష్ఠమైనది సంక్రాంతి.
గ్రీష్మతాపంతో బీటలు వారిన భూదేవి వర్షపాతం హర్షమై ఝల్లుమనగా కర్షకుడు అది అదనుగా భూమిని పదునుచేసి, చదునుచేసి,విత్తులు చల్లగా మెల్లగాచలించి సస్యశ్యామలమై ఫలించిన తరుణంగా, పంటచేల నుండి ఇంట గాదెల్లో ధాన్యలక్ష్మినిక్షిప్తం చేసుకున్నప్రజాళికిఆనందంహృదయం నిండగా, ఉత్సాహం మెండుగా జరుపుకునే పండుగ ఈసంక్రాంతి పండుగ.

సంక్రాంతి అంటే (సమ్యక్ క్రాంతి) సంక్రమణము. అనగా కదలిక కాక వ్యాప్తి, విస్తరణ అని కూడా అనవచ్చు శూన్యంలో అంతర్లిహితమైన చరాచర జగత్తు దృగ్గోచరం కావడానికి వెలుగును ప్రసాదించే చక్షువుగా సూర్యభగవానుని పరిభ్రమణం ఆధారంగా ఏర్పరచుకున్న పర్వదినం ఈ సంక్రాంతి.

ఖగోళకంగా మేషాది ద్వాదశ రాసుల్లో ఉదయాస్తమయాల భ్రమకలిగిస్తూ నెలకొక్కరాశి వాసంగా వత్సరమంతా అవిశ్రాంతంగా పరిభ్రమించే సూర్యుడు, దక్షిణ అయనం పూర్తి చేఝుకొని ఉత్తర అయనానికి నాందిగా జనవరి 14 వ మకర రాశిలోకి సంక్రమించే పుణ్యకాలమే మనకు గర్వమైన పర్వంగా రూపొందింది.

ఉత్తరాయణ పుణ్య వేళ ఔర్ధ్విక కర్మలు ఆచరిస్తే, పితృదేవతలకు ఉత్తర గతులు కలుగుతాయన్న భావనా విధమే,ఈపుణ్యకాలాన తర్పణాధికాలు, దానధర్మాలు నెరవేర్చ డమన్న వైదిక కర్మాచరణం నేటికీ కొనసాగుతునే వుంది. భారత మహా సంగ్రామంలో సూర్యుడు దక్షిణ అయనం చేస్తూవుండగా రణభూమిని వాలిన భీష్మాచార్యుల వారు ఉత్తరాయణ పుణ్య కాలం కోసం అంపశయ్యపై ఎదురు చూచి ఆఉత్తమ కాలం సంక్రమించగా కడశ్వాస విడచిన పౌరాణికగాథ ఉత్తరాయణ పుణ్యకాల విశిషతకు నిదర్శనంగా ఎంచవచ్చు.

అట్టి ఈ పండుగను లౌకికంగా కాలమాన పరిస్థితులకు అనుగుణంగా మలచుకొని అనేక రూపాలుగాజరుపుకోడం జరుగుతూవస్తోంది; పుష్యమాసం హిమపాతంలోకొంకర్లు తిరిగే చలిగాడ్పుల సమయం. ఈ సమయంలో ఆకలి మెండుగాఉంటుంది. ఆ ఆకలినితీర్చడానికి — అనువుగా ప్రాతఃకాలంలో శీతలోదక స్నానం —స్నానానంతరంజప తపాదులు ముగించుకొని దేవళంలో దైవదర్శనంచేసుకొని ప్రసాదం స్వీకరించే ఆచారం ఏర్పరచారు. ఇట్టి ఆచారాలో ఆరోగ్య సూత్రాలు ఇను మడింపబడి వుండటం గమనార్హం. వాత పిత్త శ్లేష్మ భూయిష్టమైన శరీర తత్వానికి అనువుగా వేడిని పుట్టించడానికి పులిహోర చలవచేయడానికి చక్రపొంగలి, శ్లేష్మహరంగా దద్ధోజనం వంటివి దండిగా ప్రాతః కాలంలో ఆరగించి జీర్ణించుకోడానికి వీలుగా ప్రసాదాలు నిర్ణయించి, అటుదైవభక్తికి ఇటు ఆకలి విముక్తికి మార్గంకలిగిస్తూ ఆరోగ్య ప్రదమైన ఆచారం ఏర్పాటుచేశారు.

ఈ విధంగా ప్రతిసాంప్రదాయాన్ని పరిశీలించి చూస్తే — అనేక విధాల ఈ పండుగలు జరుపుకోడంలో అనుసరిస్తున్న విధానాలు ఒక ప్రయోజన సాధనకు అనువుగా నియమించుకున్నవిగానే గోచరిస్తాయి. అట్టి సాంప్రద ప్రదమైన ఈ సంక్రాంతి రంగారు బంగారు ముంగి

ళ్ళలో ముత్యాల ముగ్గులతోను బంతి చామంతి పూబంతులతో ఇంతులు ద్వారాలను అలంకరించగా–తీర్చిన ముగ్గుల్లో కూర్చిన గొబ్బెమలను బాలికలు పేర్చగా, కొత్త సొబగులుకూర్చగా; చారిత్రక, పౌరాణిక సామాజిక గాథల ప్రతీకలుగా ఇంటింటానెలకొల్పేబొమ్మల కొలువుల సందడి కలిగించే ఈపండుగ స్త్రీపురుష అబేధంగా ఆబాలగోపాలానికి ఆనంద ప్రదాయిని.

పెద్దల మొదలు పిన్నలవరకు, కలిమిలేములకు అతీతంగా భోగి మంటల సరసను సమాగమం సమసమాజ భావనకు ఆస్కారమిస్తుంది. ఆధాత్మిక దృక్పధంగా హరిలోరంగాహరి'గానా మృతలహరి తేలించగా, హరిదాసులు కలిగినంతలోభిక్షువులకుధనధాన్యాలసమర్పణ;ప్రజల ధార్మిక భావ ప్రదర్శనకు నిదర్శనం ప్రజాహృదయాలను స్పందింప జేసే అనేక కళారూపాలు ప్రదర్శనలూ ఈపర్వదినాల్లో చోటు చేసుకుంటూ వుంటాయి.

హేమంతఋతువల్లరిలో అల్లరిపిల్లలు ఎగిరించే గాలిపతంగాల కేతింతలు, గంగిరెద్దుల ఆటలు, గొబ్బెళ్ళ పాటలు, కోడిపందేల వేటలు మంగళ ప్రదవాద్య ఘోషలు రణగొణధ్వనులతో సంబరం అంబరానికి విస్తరిస్తున్న ఈ సంక్రాంతి సుసమయంలో సంక్రమిస్తున్న కొమరగిరి వారి శ్రీవాణీ సంచికా విపంచి పదుగురి ఆదరాభిమానాన్ని పంచుకొని, ఎదనిండా ఆత్మీయత నించుకొని సత్కీర్తిని పెంచుకొనే సువాణిగా భవితవ్యంలో రాణించాలని ఆకాంక్షిస్తూ ఆ శ్రీవాణికి కేల్మోడుస్తున్నాను.




# సాధ్యమా?

–నారంశెట్టి ఉమామహేశ్వరరావు

తరాల నుండి చూస్తున్నా
కులాంతరాల గోడల్ని,
మతాంతరాల సౌధాల్ని!
ఎప్పుడైనా, అవి బీటలు వారాయే కాని!
కుప్ప కూలాయా?
లేదు! ఎందుకు కూలాయ్?
కుల పెద్దల లు
బట్టలు నలగకుండా ఇస్త్రీ చేసినట్టు
మూఢ నమ్మకాల తాపీలతో
ద్వేషం సిమ్మెంటు రాస్తుంటే
కులాల గోడలు గట్టి పడతాయే కాని
కుప్ప కూల్తాయా?

# బాలీ ద్వీపంలో భారతీయ సంస్కృతి

బాలీ ద్వీపంలో కౌశాంబీ అనే నగరం వున్నది. ఆ ఆచుట్టు ప్రక్కల గ్రామాలలో ప్రతి ఇంట శివుడు, బ్రహ్మ, విష్ణుమూర్తి విగ్రహాలు మందిరాలలో కానవస్తాయి. సింహరాజ్ నగరంలో 'మాయా' అనేసినిమా హాలువున్నది. అక్కడ ఒక పాఠశాల పేరు 'భక్తియశ'. ఒక గ్రంథాలయం పేరు 'ఉద్యాన జ్ఞాన 'భువన'. ఒకవీధి పేరు. 'గిరిపుత్రీ'. అక్కడి పరిశోధన సంస్థ పేరు.' గదడౌ కీర్త్యా' అచట సంస్కృత భాషలో నున్న తాళ పత్రాలున్నాయి. ఈ నగర సమీపాన సముద్ర తీరంలో 'బులె లెడ్' నగరం వున్నది. అచట మూడు వరుణ దేవాలయాలున్నాయి. ఈ ఆలయాలను 'పురసాగర్' అని 'బటార్ బ్రూణ. అని పిలుస్తారు. బాలీ భాషలో 'పుర' అంటే ఆలయం. 'బటార్' అంటే భటారే లేక భగ వానుడనీ.'బ్రూణ' అంటే 'వరుణ అని అర్థం. బాలీ ద్వీపంలో బస్సుల పేర్లు 'సంపాతి! జటాయువు'. భారతీయ సంస్కృతీ ప్రభావం నేటికీ, అడుగడుగునా బాలీ ద్వీపంలో కనపడు తుంది.

# మహాభారతము - ఒక పరిశీలనము

ʙʙʙʙ★ʙʙʙ★ʙʙʙʙʙʙʙʙʙʙʙʙʙʙʙʙʙʙʙ★ʙʙʙʙʙʙʙʙʙʙʙʙʙʙʙʙ★ʙʙʙʙʙʙʙʙ

## •. దివాకర్ల వెంకటావధాని

నారాయణం నమస్కృత్య నరం చైవ నరోత్తమం
దేవీం సరస్వతీం చైవ తతో జయ ముదీరయేత్

నారాయణునికిని, నరోత్తముడైన నరునికిని, సరస్వతీ దేవికిని నమస్కరించి తరువాత జయమును చెప్పవలెను.

భగవత్స్వరూపుడైన వ్యాస మహర్షి క్రీస్తుశకమునకు పూర్వము జయమను పేర మహా భారతమును రచించెను. అది మొదట శత సహస్ర శ్లోక విస్తృతమై యుండ లేదనియు కాల క్రమమున ప్రక్షేపములతో కూడి భారత మహాభారత నామములు పొందెననియు కొందరి అభిప్రాయములు. జయ శబ్దమునకు సంఖ్యా నిర్దేశకమైన సాంకేతికార్థమున్నది. కాదిమాంతములైన హల్లులలో జకారమెనిమిదవోది. మిగిలిన యాదిహాంతములైన హల్లులలో యకారము మొదటిది. అందుచే జకారములకిని యకారముకిని సంకేతములు. 'అంకా నాంవామతో గతిః' అను నిర్దేశము ప్రకారము జయమనగా అగును. మహా భారతమున 18 ప్రధాన పర్వములున్నవి. కురుక్షేత్ర సంగ్రామము 18 దినములు జరిగినది. అందు కౌరవ పక్షమున 11 అక్షౌహిణులును, పాండవ పక్షమున 7 అక్షౌహిణులును మొత్తము 18 అక్షౌహిణులు యుద్ధ మొనరించినవి. మహాభారత హృదయమని చెప్పదగిన భగవద్గీతలో 18 అధ్యాయము లున్నవి. భారతమున అష్టాదశ (18) విద్యల సారము నిక్షేపింపబడియున్నది. శిక్ష. వ్యాకరణము, ఛందము, కల్పము, నిరుక్తము. జ్యోతిషము అను ఆరు వేదాంగములు వేదములు నాలుగు, మీమాంస, న్యాయము, ధర్మశాస్త్రము పురాణము ఆయుర్వేదము, ధనుర్వేదము, గాంధర్వము, అర్థశాస్త్రము అను పదునెనిమిదియు అష్టాదశ విద్యలు. అందుచే భారతమునకు జయ నామము సార్థకము.

మహాభారతము 'నారాయణం నమస్కృత్య' అను మంత్రాత్మకమైన శ్లోకముతో నారంభమగునని కొందరును (మన్వాది భారతం కేచిత్), ఆస్తీక చరిత్రముతో ఆరంభమగునని కొందరును, ఉపరిచర వసు వృత్తాంతముతో ఆరంభమగునని కొందరును అభిప్రాయ పడుచున్నారని నీలకంఠుడు తెల్పియున్నాడు. ధృతరాష్ట్ర పాండురాజుల ఉదయమునకు కారణభూతుడు వ్యాసుడు. అతని తల్లి సత్యవతి (దాశకన్య). ఆమె ఉపరిచర వసువీర్యోత్పన్న అందుచే భారతము ఉపరిచర వసు వృత్తాంతముతో నారంభించుట సమంజసము.

''మహత్త్వాద్భాగవత్త్వాచ్చ మహాభారత ముచ్యతే'' అను సూక్తి వలన మహత్త్వము వలనను, భారవత్త్వము వలనను మహాభారతమున కాపేరు కల్గినదని తెలియుచున్నది. శకుంతలా దుష్యంతుల కుమారుడైన భరతుని వంశమునకు చెందిన కౌరవ పాండవుల వృత్తాంతమును వర్ణించున దగుటచే దాని కాపేరు వచ్చినదనియు చెప్ప వచ్చును. భరతుడు, భుమన్యుడు, సుహోత్రుడు, హస్తి (ఇతని పేరనే హస్తినాపురమను నామ మేర్పడెను.) వికుంఠనుడు, అజమీఢుడు, సంవరణుడు, కురుడు (కౌరవులను పేరితని వలననే కలిగెను. కురు గోత్రజులు, కౌరవులు. కురుక్షేత్ర నామము కూడ ఇతని వలన వచ్చినదే) విదూరథుడు, అనశ్వుడు, పరీక్షితుడు, భీమసేనుడు, ప్రతిశ్రవసుడు, ప్రతీపుడు; శంతనుడు, చిత్రాంగద,విచిత్రవీర్యులు, ధృతరాష్ట్ర పాండురాజులు-అనునది భరతవంశ క్రమము.

వ్యాసుడును, నన్నయ తిక్కనలును భారతమహత్త్వమును సవిస్తరముగా వర్ణించియుండిరి. బంగారు కొమ్ము

లును, ఖురములును గల నూరు కపిల గోవుల నుత్తము లైన బహువేద విప్రులకు దానము చేయుటవలన కలుగు ఫలము భారత కథా శ్రవణాభిరతిచే కలుగుననియు; బహు భాషలలో, బహు విధముల, జనులవలన వినుచు, భారత బద్ధ స్పృహులకు వారికి బహుయాగము లొనరించిన ఫలము చేకూరుననియు, భారత భారతి దుర్గ మార్గ జాల గౌరవముతోగూడిన సముద్రము వంటిదనియు, అది సూర్య కిరణములవలె ఘోర సంసార వికార సంతమసజాల విజృంభము వాపి సూరిచేతో వారి జాత బోధనదక్షమై అల రారుననియు, అది గంగా ప్రవాహమువలె వినువారికిని ప్రశంసించు వారికిని నిరంతర పుణ్య సంపదభివృద్ధి సమ కూర్చుననియు, భారత మాయుర్ధన ధర్మ వినయ పుత్ర సంపదాద్యర్థుల కభిలషితార్థముల నొసంగుననియు, అది ఆఖ్యానకము లనెడి శాఖలతోడను, వేదార్థమనెడి ఛాయ తోడను, చతుర్వర్గములనెడి పుష్పములతోడను, కృష్ణార్జున గుణ సంకీర్తనమనెడి ఫలముతోడను కూడిన కల్పవృక్షమై వ్యాసోద్యానమున నుత్పన్నమయ్యెననియు, దానిని విన్నవారికి వేద పురాణ తత్వమిత ధర్మ మోక్ష శాస్త్ర తత్వముల నెరింగిన ఫలమును, దాన క్రతు జప బ్రహ్మ చర్యాదుల నిర్వహించిన పుణ్య ఫలమును కలుగుననియు, సకల పాప సంక్షయమగుననియు; అది ధర్మార్థ కామ మోక్షములకు పరమ సాధనమనియు, రాజులకు భూరాజ్యాభివృద్ధ్యభ్యు జయప్రదమనియు, త్రికరణ కృతానేక జన్మ పాపౌఘ నిబర్హణమనియు, ఆయుష్యమనియు, ఐహికాముష్మిక శ్రేయఃప్రాప్తి నిదానమనియు, లోకాగమన్యాయైకాంత గృహమనియు, నానా వేద వేదాంత విద్యాయుక్త మనియు, నన్నయ భారతమహత్యము నుగ్గడించియుండెను దాని నతడు 'మహా భారత సంహిత' అని సంహితాఖ్యతో పేర్కొనుటయే దాని మహత్యమును చెప్పక చెప్పుచున్నది. అదియొక మహా ప్రపంచము. ఉప ద్వీప మహా ద్వీప సంభృతమైన ప్రపంచము నజుడు నిర్మించి నట్లనేక విధపదార్థప్రపంచ సంచితమును ఉపస్వరమహాపర్వశోభితమును అయిన దానిని కృష్ణద్వైపాయనుడు నిఖిలలోకసర్వహితార్థమై నిర్మించియుండెను. తిక్కన అది లేఖ్యమైన అమ్నాయమనియు, వ్యాసుడు దానిని లోకహిత నిష్ఠుడై ధర్మాద్వైత స్థితితో రచించెననియు చెప్పుటయేకాక

వేదములకు నఖిల స్మృతి
వాదములకు బహుపురాణ వర్గంబులకున్
వాదైన చోటులను దా
మూదల ధర్మార్థ కామ మోక్ష స్థితికిన్

అని వర్ణించియుండెను. స్మృతి పురాణములకును వేదములకును వైరుద్ధ్యముండనే యుండదు. ఎచ్చట నైననట్టి దున్నట్లు తోచినచో భారతము దానిని తొలగించి వానికి సామరస్యము చేకూర్చును.

భారవత్త్వ మనగా శత సహస్ర శ్లోక పరిమితమగుటచే బరువుగా నుండుట అని మాత్రమే అర్థము కాదు. భారతము సర్వ జ్ఞాన భారశోభితము. అందు లేని లౌకిక పారలౌకిక జ్ఞాన బోధక విషయమే లేదు. అది సర్వ విజ్ఞాన కోశము. అందుచేతనే వ్యాసుడు "ధర్మే చార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ, యాదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్క్వచిత్" అని స్పష్టముగా చెప్పియుండెను. దీనిని పురస్కరించుకొనియే నన్నయ "ధర్మ తత్వజ్ఞులు ధర్మశాస్త్రమనియు, అధ్యాత్మ విధులు వేదాంతమనియు.

## రెండు వర్గాలు

—ఎ. శ్రీహరి

అంతస్తుల్లోని
ఆకారాలు
ఆరగిస్తున్నాయి
పుట్టిన రోజు 'కేకులు'!
పూరి గుడిసెల్లో
వినిపిస్తున్నాయి
ఆకలి—
"ఆకలి కేకలు!"

నీతి విచక్షణులు నీతిశాస్త్రమనియు, కవివృషభులు మహా కావ్యమనియు, లాక్షణికులు సర్వలక్ష్య సంగ్రహమనియు ఇతిహాసకు లితిహాసమనియు, పౌరాణికులు బహుపురాణ సముచ్చయమనియు, కొనియాడుచుండ వ్యాసుడు భారతమును విశ్వజనీనముగా రచించియుండె''నని వివరించి యుండెను.

వేదమును కర్మకాండము, జ్ఞానకాండము అని రెండు కాండములుగా విభజింతురు. అందుపనిషత్తులు జ్ఞానకాండ భాగములు. పంచమ వేదమైన భారతమును కూడ రెండు కాండములుగా విభజింపవచ్చును. భగవద్గీత, సనత్సుజాతీయము మున్నగునవి జ్ఞాన కాండమునకు సంబంధించినవనియు, యజ్ఞాదులతోను రాజకీయ నైతిక విషయములతోకూడిన భాగములు కర్మకాండమునకు సంబంధించినవనియు చెప్పవచ్చును. శ్రీ మద్భగవద్గీత సర్వోపనిషత్సారము, యోగశాస్త్రము, బ్రహ్మవిద్య, వ్యాసుడు దానిని నిపుణముగా భీష్మ పర్వారంభమున చొప్పించియుండెను. కర్మజ్ఞాన భక్తి సమన్వయము చేయునట్టి విశ్వజనీన గ్రంథము విశ్వమున మరే భాషయందును లేదని చెప్పవచ్చును. అది మహాభారత హృదయము. భారతమునకు వేదత్వము కలిగించిన భాగములలో నది ప్రధానమైనది.

తొల్లి కృతత్రేతావసానములందు దేవాసుర రామరావణ యుద్ధములవలె ద్వాపరాంతమున పాండవ ధార్తరాష్ట్రులకు మహా ఘోర యుద్ధము జరిగెను. అదే కురుక్షేత్ర సంగ్రామము. స్థూలదృష్టికి అది పాండవ కౌరవులకు జరిగిన యుద్ధమువలెనే కనిపించును. కాని సూక్ష్మముగా పరికించినచో ధర్మాధర్మములకు జరిగిన మహాయుద్ధమని చెప్పవచ్చును. తిక్కన ఉద్యోగ పర్వమందు వ్యాసుని శ్లోకములనే అనువదించుచు వ్రాసిన

రోషమయ మహాతరువు సుయోధనుండురు
స్కంధమందు లోనఁ గర్ణుఁడలరుఁ,
గొమ్మ సౌబలుండు, కుసుమ ఫలములు దు
శ్శాసనుండు, మూలశక్తి తండ్రి. ౧-355

ధర్మజుండు ధర్మతరు, వర్జునుఁడు ఘన
స్కంధ, మనిల సుతుఁడు శాఖ, కవలు
పుష్ప ఫలము, లేను భూసురులును వేద
ములు తదీయమైన మూలచయము ౧-356

అను పద్యములలో ఈ విషయము ధ్వనించుచున్నది. అంతమున ధర్మము జయించుటయు అధర్మము పరాజితమగుటయు సంభవించినది. లోకమున మానవుల హృదయములందు ఏ కార్య మాచరించునపుడైనను ధర్మాధర్మములకు సంఘర్షణము జరుగుచునేయుండును. మానవులు కొన్ని యెడల పరమ ప్రమాణమైన అంతఃకరణము నొప్పరికించి మనస్సునకు వశులై అధర్మము నాచరింతురు. అప్పుడు వారు తాత్కాలికముగా జయము పొందినట్లు కనిపించినను చివరికి నాశము పొందుదురు. మహాభారతము లోకమున కిచ్చు పరమ సందేశమిది. అది చెప్పు నిత్య సత్యము లింకను అనేకములున్నవి. భారతము చదువువారు వానిని సులభముగా తెలిసికొనవచ్చును. లౌకిక సంస్కృత వాఙ్మయమున మహాభారతము ధర్మాధర్మనిర్ణయ విషయమునందద్వితీయము. వేదార్థోప బృంహణార్థమే రామాయణ భారత భాగవతములు సృజింపబడినవి.

లాక్షణికులు కావ్యమునకు యశస్సు, అర్థము, వ్యవహార వేత్తృత్వము, అమంగళ పరిహారము, సద్యఃపరనిర్వృతి, కాంతా సమ్మితముగా నుపదేశించుట ప్రయోజనములని తెల్పియుండిరి. ఈ ప్రయోజనములలో కొన్నిటిని మాత్రమే నిర్వహించు కావ్యము లెన్నో యున్నవి. అన్నిటిని సాధించునవి మూడే. అవి రామాయణ భారత భాగవతములు. వాని వైశిష్ట్యము నింతకంటె వేరుగాచెప్ప నవసరము లేదు. అవి సంస్కృత సారస్వత రత్నాకరము నుండి వెలువడిన అనర్ఘ రత్నములు. అభ్యుదయ కాంక్షులందరును తద్భావ కాంతులను చూఱలాడి తరింప వలసియున్నది.

వ్యాసుడు సంస్కృతమున రచించిన మహాభారతమును కవిత్రయమువారు తెనుగున వెలయించిరి. వారు కేవల మనువాదము చేయుటకే యత్నించి యుండలేదు. మూల

మున విస్తృతములుగానున్నను తమ కనవసరములని తోచిన భాగములను తగ్గించిరి; అవసరములని తోచిన భాగములను పెంపు చేసిరి; దేశ కాల భేదములచే అనుచితములని తోచిన వానినన్యథాకరించిరి. అయ్యును "కృష్ణ ద్వైపాయనముని వృషభాభిహిత మహాభారత బద్ధ నిరూపితార్థమున కెచ్చటను భంగము కలిగించియుండలేదు. సంస్కృతమున నితిహాసమని చెప్పదగిన భారతమును వారాంధ్రమున రసవన్మహా కావ్యముగా తీర్చిదిద్ది యుండిరి.

విశాలమైన ప్రపంచమున వివిధ చిత్త ప్రవృత్తులతో కూడిన వ్యక్తులెందరోయున్నట్లు మహాభారతమున వివిధ శీల స్వభావములతో కూడిన పాత్రలెన్నియో కలవు. తచ్చిత్రణమున కవిత్రయమువారు చూపిన కౌశల మనన్య సామాన్యము. శ్రీవాణి యవనికపై నందలి ముఖ్య పాత్రల స్వరూపములను ప్రదర్శించుటకు యథాశక్తి

సకల జగత్ప్రథితాం
భారత సాహిత్య సంస్కృతి ప్రతిభాం
ప్రకాశయితు మారబ్ధా
శ్రీవాణీ పత్రికా చిరం జయతామ్

# నీటిజాడలు చెప్పే మొక్కలు

సృష్టిలోని జీవరాశి అంతటికి నీరే ప్రాణాధారం ఆకాశంనుంచి వర్ష రూపంలో పడేనీరు నదులై ప్రవహించి, వ్యవసాయానికి, ప్రజలు త్రాగడానికి ఉపకరిస్తోంది.

కొంత నీరు ఇంకి భూగర్భజలంగా మారుతోంది. అంతే కాక భూమి పొరలలో అనాదిగా పాతాళ గంగ పారుతోంది. భూమిలో ప్రవహించే యీనాటి నీళ్ళకు ''సిరలు'' అని ప్రాచీనులు పేరు పెట్టారు. పైగా అది ప్రవహించే దిక్కును బట్టి ఆయా దిక్కుల అధిపతుల పేర్లు వుంచారు. ఇంద్రసిర, అగ్నిసిర, యమసిర, నిర్ృతిసిర, వరుణసిర, వాయుసిర, సోమసిర, శంకరసిర అని వాటి పేర్లు.

అంతేకాక భూగర్భంలో నుంచి మధ్యగా ప్రవహించే జలవాహినికి ''మహాసిర'' అని పాతాళం నుంచి పైకి ప్రవహించే జలధారకు ''మహానాడి'' అని, పేర్లుంచారు. ఆగ్నేయ, నైరృతి, వాయవ్య, శాంకర దిశలనుంచి వెలువడే జలధారలలో నీరు స్వల్పం అని సూత్రీకరించారు.

ఈనాడు పాతాళగంగను గుర్తించే సాంకేతిక పరికరాలు యెన్నో ఉన్నాయి. అయితే ప్రాచీన కాలంలో భూగర్భ జలాలనుగుర్తించే విధానాలేమిటి?

పాతాళ గంగను గుర్తించే పద్ధతుల్ని వరాహమిహిరుడు "జలార్గళశాస్త్రం''లో వివరంగా చెప్పాడు. నేలపై కనిపించే మొక్కల్నిబట్టి యెక్కడ యెంతలోతున, యెంత మేరగా పాతాళగంగ లభిస్తుందో గుర్తించవచ్చని జలార్గళ శాస్త్రం కొన్ని సూత్రాలు ఇచ్చింది. వాటిని పరిశీలిద్దాం.

చుట్టుప్రక్కల యెక్కడా నీరులేనిచోట "నీటిప్రబ్బలి" మొక్క ఉన్నట్లయితే దానికి పశ్చిమ దిక్కులో మూడు మూరల దూరంలో ఒకటిన్నర పురుషుల ప్రమాణం లోతు త్రవ్వితే అక్కడ పాతాళగంగ లభిస్తుంది'' పురుష ప్రమాణమంటే 120 అంగుళాలని శాస్త్ర నిర్వచనం.

నీరులేనిచోట నేరేడుచెట్టు ఉన్నట్లయితే దానికి ఉత్తర దిక్కున మూడు మూరల దూరంలో నేలలో రెండు పురుషుల లోతున జలనాడి లభిస్తుంది. దీనిని ఐంద్రియనాడి అంటారు. అక్కడి మట్టికి ఇనుపవాసన ఉంటుంది.

నేరేడుచెట్టుకు తూర్పున పుట్ట ఉన్నట్లయితే అక్కడకు దక్షిణాన రెండు పురుషుల ప్రమాణం లోతున భూమిలో మధురజలాలు ఉంటాయి. అత్తిచెట్టు ఉన్నట్లయితే దానికి పశ్చిమ దిక్కున మూడు మూరల దూరంలో రెండున్నర పురుషుల లోతులో జలధార లభిస్తుంది। అలాగే మద్ది చెట్టు ఉన్నట్లయితే దానికి పడమరగా మూడు మూరల దూరంలో మూడున్నర పురుషుల ప్రమాణాన త్రవ్వితే నిర్మల జలాలు లభిస్తాయి.

## విజ్ఞానతరంగాలు

నల్లవావిలి చెట్టుకు పుట్ట ఉన్నట్లయితే దానికి దక్షిణాన మూడు మూరల దూరంలో రెండుంబాతిక పురుషుల లోతులో జీవజలాలుంటాయి. రేగుచెట్టునకు తూర్పుదిశలో పుట్ట ఉంటే దానికి పడమరగా మూడు పురుషుల లోతు త్రవ్వితే నీరు పడుతుంది. మోదుగుచెట్టు, రేగుచెట్టు కలసియున్నట్లయితే వాటికి పడమరగా మూడున్నర మూరల దూరంలో మూడుంబాతిక పురుషుల లోతున నీరుంటుంది

అత్తిచెట్టు, మారేడు చెట్టు కలసి ఉంటే వాటికి దక్షిణాన మూడు మూరల దూరంలో మూడు పురుషుల లోతున నీరు పడుతుంది. కుక్క మేడిచెట్టు దానిక్రింద పుట్ట ఉన్నట్లయితే అక్కడకు మూడు మూరల దూరంలో

మూడుంబాతిక పురుషుల లోతున "వారిణి" అనే జలధార లభిస్తుంది. బ్రహ్మ మేడిచెట్టు ఉన్నట్లయితే ఆ ప్రదేశాన మూడు పురుషులలోతులో "యామ్యం" అనే జలధార పడుతుంది. ఎర్రజిల్లేడు చెట్టు ఉంటే దానికి వాయవ్య దిక్కున రెండు మూరల దూరంలో మూడు పురుషుల లోతున "కుముద" మనే జలనాడి యుంటుంది. తాండ్ర చెట్టు ఉన్నచోట భూమిలో ఒకటిన్నర పురుషుల లోతున జలధార లభిస్తుంది. జువ్విచెట్టు ఉన్నచోట కూడ జలనాడి ఉంటుంది అయితే అటువంటి జలధార మూడు సంవత్సరములకు ఎండిపోవును.

ఏడాకుల అరటి చెట్టు, అక్కడే పుట్ట ఉన్నచోట అయిదు. పురుషుల ప్రమాణం త్రవ్వితే నీరు పడుతుంది. కాంచనపు చెట్టు ఉన్నచోట భూమిలో జీవ జలధార పడుతుంది. భూమిపై నీరు లభించని ప్రాంతంలో ఏదైనా చెట్టు క్రింద కప్ప యున్నట్లయితే ఆ ప్రదేశాన నాలుగున్నర పురుషుల లోతున నీరు లభిస్తుంది.

కొబ్బరి లేదా తాటిచెట్టునకు పుట్ట ఉన్నట్లయితే వాటికి పడమరగా ఆరు మూరల దూరంలో నాల్గుగు పురుషుల లోతులో నీరు పడుతుంది. నీరు లేనిచోట యెక్కడయినా చుట్టూ గడ్డి మొలిచి, ఒకచోట మాత్రం మొలవక పోతే అక్కడ ధనం లభిస్తుంది, అలాగే నీటి ఊట యుండవచ్చు. అదే విధంగా ముళ్ళజాతి చెట్లు పెరిగి, మధ్య ముళ్లులేని జాతిచెట్టు మొలుస్తే అక్కడ పాతాళ గంగ ఉంటుంది.

నడిచేటప్పుడు అడుగుల ఒత్తిడికి భూమి గంభీరంగా శబ్దాన్ని విడుదల చేస్తే అక్కడ మూడున్నర పురుషుల లోతున "కావేరి" అనే జలధార ఉంటుంది. చుట్టు ప్రక్కల భూమిపై నీరు లేనిచోట చెట్లు మొలిచి, ఒక కొమ్మ మాత్రం వంగిపోయికాని, తెల్లగాకాని యున్నట్లయితె, అక్కడ మూడు పురుషుల లోతున నీరుపడుతుంది ఇదే విధంగా ఏదైనా చెట్టు విభజింపబడిన భాగాలతో, అనగా ఆకులతో కొమ్మలతో ఉన్నట్లయితే ఆ చెట్టుకు తూర్పుదిశయందు నాలుగు పురుషులలోతున నీరుఉంటుంది

# కృతజ్ఞత

—య

క్రొత్తగా శాసన సభ్యుడైన వక అయోగ్యుడు, తనకు చేస్తున్న సన్మాన సభలో, తాను ఆ నియోజక వర్గానికి యెంతో ఋణ పడివున్నానని, అందుకుగాను కృతజ్ఞతా పూర్వకంగా ఆ పట్టణానికి తక్షణావసరం మేదైనా వెంటనే సమకూరుస్తానని, అది యేదైతేబాగుంటుందనిఉత్సాహంగా ప్రశ్నవేశాడు.

'పిచ్చాసుపత్రి' అనివెంటనే వక వాణి బిగ్గరగా విని ంచింది.

రెండు తలల ఖర్జూరపు చెట్టు ఉన్నట్లయితే దానికి పశ్చిమాన మూడు మూరల దూరంలో మూడు పురుషుల లోతున నీరు ఉంటుంది.

తెల్లపూలు పూచే కొండ గోగుచెట్టు, శ్వేతపుష్ప భరితమైన మోదుగుచెట్టు ఉన్నచోటుకు దక్షిణ దిశలో మూడు పురుషుల ప్రమాణం త్రవ్వితే పాతాళగంగ పడుతుంది. ఏ ప్రదేశంలో అయినా ఎల్లపుడు వేడి పొగ వస్తున్నట్లయితే అక్కడ రెండు పురుషుల లోతున నీరు పడుతుంది.

పాతాళగంగ ఉనికినిచెప్పే మొక్కల వివరాలతోపాటు ఆయా ప్రదేశాలలోని భూమి పొరల రంగును, మట్టి రంగును రాళ్ళతీరును వరాహమిహిరుడు తన జలార్గళ శాస్త్రంలో వివరించాడు. మనిషి శరీరంలో ధమనులు. సిరలద్వారా రక్తము అధోముఖ, ఊర్ధ్వముఖాలద్వారా ప్రసరిస్తున్నట్లుగా భూగర్భంలో పాతాళ గంగాధారలు ఊర్ధ్వాధస్తిర్యక్కులుగా ప్రవహిస్తుంటాయి. అని ఆయన వర్ణించాడు. సారస్వతమని చెప్పిన సూత్రాలు తన జలార్గళ శాస్త్రానికి ఆధారాలని వరాహమిహిరుడు పేర్కొన్నాడు.

# సమైక్య గీతం

డాక్టర్ ముదిగొండ శివప్రసాద్
ఎం. ఏ., పి. హెచ్. డి.

ఇయంపృథ్వీసత్యమస్తు!
ఈ మేదిని
"అహం రాష్ట్రీసం గమనీవసూనాం" అని ప్రక
టించిన వసుంధర
ఈ ఋగ్వేది బాటలో
ఉప నిషదుద్యానవనీ శాఖాశాఖి కలనాశ్రయించిన
శుక పికాలనోట
వేదారణ్యకాల పాట
ఈ గీతం
సుమహిమజల పాతం
జనగణమన సమైక్య సంగీతం
యుగ సంకేతం
ఈ గీతానికి రాగాలు అనురాగాలు నా ప్రజలు
ఆసేతుశీత నగపరివ్యాప్త నర నారీశత
సహస్ర నిస్వనాలు సుస్వరాలు
హిమశీతల మణి మందిర గుణ సుందర గణ
సాంద్ర
రసార్ద్ర మహిత జనబంధురబృందారక
సందోహ సమాను
మాన్యులు-అసామాన్యులు-నాప్రజ
అర్చిత వేళా మంత్రాక్షతలై
దక్షతతో
ఈ చైత్ర పూర్ణిమా కుసుమాంజలిగా
తమ తనువులనే కానుక పెట్టిన
త్యాగ ధనులు
మాన్యులు-అసామాన్యులు- నాప్రజ
ఇవిగో ఈతోటలోని రంగురంగు శకుంతాలు
వన్నెల వెన్నెల కలువల కలువల కొలనుల కడ
నిలిచిన
వెలుగుల పులుగులవి
అమృతసరోవరసువర్ణకాంతిచ్ఛట లేపక్షములైనవి
సారనాధ శాంతిదూతలై సంఘమిత్రలై-మహేం
ద్రులై
అనూరాధపుర మునగూడు కట్టుకున్నవి
క్షేమంకర తీర్థంకర కీర్తి మూర్తులై
వేకువలో అహింసకై
వైతాళిక గీతం పాడినవి
ఇదొక సుందర నందనవని
ఈ తోటలోని మొక్కలుగా ప్రజ
ఈ చెట్టుకున్న పూవులవలె ప్రజ
పూలలోని రేకులవలె ప్రజ
రేకు రేకు రంగులవలె ప్రజ
రంగులకి మ్మీరంవలె ప్రజ
పుష్పార్ద్రపరాగంవలె ప్రజ
పుప్పొడిలో రేణువులై ప్రజ
కింజల్క సమూహంవలె ప్రజ
ప్రగతి పథంలో సహస్రదళార విందంగా
అతి మానసులై ఎదిగిన ప్రజ
ఈ సమాజ జాహ్నవిలో జలబిందువులై ప్రజ
ఈ జాతీయ ఉషస్సుషమలో
కిరణ సమూహం ప్రజ
దేశమనే ఆకాశసరోవరంలో
చుక్కల హంసల నడుమ
చందమామలా వికసించిన ప్రజ

ఈ ప్రజా నందనంలో
చెట్టు వేరైనా నేల ఒక్కటే!
బొమ్మలు వేరైనా మట్టి ఒక్కటే!
నదులు వేరైనా నీరమొక్కటే!
భాషలు వేరైనా భావమొక్కటే!
పుష్పాలు వేరైతేనేం, పూజమాత్రం ఒక్కటే!
ప్రాంతాలు వేర్వేరైతేనేం, భారతీయత ఒక్కటే
దేశం అంటే జాగ్రఫీ పుస్తకంలోని గీతలు కాదు
ఇది చిరంతన నిరంతర సనాతనపురాతన పూజా
మందిరం
అనాద్యనంత స్వయంభూవు
అఖండతా ప్రవాహ ప్రాణశక్తి
దేశమనే విపంచికలో సుస్వరమై పలికినవాడూ
దేశమనే నృత్యానికి పదమై పల్లవించిన వాడూ
దేశమనే గీతానికి అక్షరక్రమమై అమరిన వాడూ
దేశమే ఒకసమైక్యసౌధమైతే దానికి
పునాదిరాయిగా నిలిచిన వాడూ
తనతనువే వంతెనగా కట్టి
ధర్మరధాన్ని నడిపించిన వాడూ
కులమత వర్గ వర్ణభేదాల కతీతుడూ
క్రాంత దర్శి-భారతీయుడతడు
అతనిదేహమే ఒక శృంగార నీరాజనం
ఈ దేశమే ఒక బంగారు దేవాలయం
(ఇటీవల హైదరాబాదు దూర దర్శన్‌లో జాతీయ సమైక్య
తకు ఉద్దేశించి వినిపించిన కవిత)

# 1986లో తోకచుక్క

ఆ తోకచుక్క పేరు హేలీ. గత 2000 సంవత్సరాలుగా ఆతోకచుక్క మనిషికి తెలుసు. చాలా మంది తమ జీవిత కాలంలో ఆతోకచుక్కని ఒక్కసారి చూడగలరు. అది భూగ్రహానికి దగ్గరగా ప్రతి 76 సంవత్సరాల కొకసారి వస్తూంటుంది. ఆఖరిసారి అది 1910లో వచ్చింది. మళ్ళీ 1986లో వస్తోంది. మనిషి దాన్నిగమనించాక అది తిరిగి కనబడటం 30వ సారి.

అది కనబడ్డప్పుడల్లా గతంలో అనేక మూఢనమ్మకాలు దానిచుట్టూ చోటు చేసుకున్నాయి. ముస్లిం మత ప్రవక్త మొహమ్మద్, రోమన్ చక్రవర్తి కాన్‌స్టాన్‌టెయిన్, రష్యన్ జారు చక్రవర్తి ఇవాన్‌ది టెరిబుల్ మొదలయినవారి మరణం ఆతోకచుక్క కనపడ్డాకే జరగడంతో, అది కనిపించిన కొద్దికాలానికే ప్రముఖవ్యక్తి మరణిస్తాడనే మూఢనమ్మకం ప్రజల్లో ప్రబలంగా ఉండేది.

## మనకు తెలియని ప్రపంచం

### మల్లాది వెంకటకృష్ణమూర్తి

శాస్త్రజ్ఞుడు న్యూటన్ మిత్రుడయిన ఎడ్‌మండ్ హేలీ 1656లో జన్మించాడు. అతనికి ఖగోళ శాస్త్రంలో ఆసక్తి ఉండేది. కొత్తగాకనిపెట్టబడ్డ యూనివర్సల్ గ్రేవిటేషన్ థియరీ ననుసరించి హేలీ 1682లో దాని మార్గాన్ని లెక్కకట్టాడు. అతని లెక్కని నిజం చేస్తూ, ఆ తోకచుక్క తిరిగి 1758 లో భూమికి దగ్గరగా వచ్చి మనుషులకు కనిపించింది. ఆతోకచుక్కకి దానిగమనాన్ని కనిపెట్టిన హేలీ పేరు పెట్టారు.

అది భూమికి అతి దగ్గరగా వచ్చే దూరం లక్షా 30వేల కిలో మీటర్లు. ఈసారి భూమికి దగ్గరగా వచ్చినపుడు అమెరికా శాస్త్రజ్ఞులు యిరోపాలోని వివిధ దేశాలకి చెందిన శాస్త్రజ్ఞులు దాన్నిగురించి పరిశోధనలు చేయడానికి నిర్ణయించారు. ఇందుకోసం అంతరిక్షంలోకి దాన్ని, అంతరిక్ష నౌకలని ప్రయోగిస్తారు. వాటి దారి, వేగం, ఆఖరికి ఆనౌకలబరువు చివరి గ్రాము దాకాకూడా నిర్ణయించారు.

అంతరిక్ష నౌక అంతరిక్షనుంచి మరో చిన్న నౌకని హేలీవైపు ప్రయోగిస్తుంది.

రష్యన్, జపనీస్ శాస్త్రజ్ఞులు కూడా పరిశోధనలు చేయడానికి ఆయత్తమయ్యారు. 1301లో ఆతోకచుక్క చిత్రాన్ని గీసిన చిత్రకారుడు జియొట్టొ పేరుని అమెరికన్స్ ఈ ప్రాజెక్టుకి పెట్టారు.

ప్రస్తుతం ఆతోకచుక్క క్షణానికి 15కిలో మీటర్ల వేగంతో భూమివైపు ప్రయాణిస్తోంది.



# కాలం మారిందా?

కాలపురుషుడి గమనంలో క్యాలెండర్ కాగితాలు రెప రెపలాడుతూ ఎగిరిపోయాయి. ఎవరు ఆపగలరు ఆ నడకను అందుకే గోల్డ్‌స్మిత్ అంటాడు 'కాలాన్ని మించిన నియంతలేడు' అని

ఈ సంవత్సరం తొలి రెండురోజులు ఆకాశం మేఘావృతమై వుంది, వర్షంచింది కూడా. మరి అది ఆనంద భాష్పమో విచారపు వేడి కన్నీరో అర్థం కాకుండా వుంది ఎందుకంటే రక్తాక్షితో చెలిమి చేయవచ్చి క్రోధంతో కాల గర్భంలో కలిసిపోయే 1985 సంవత్సరం. కనుక ఆనాడు ఏమి కోలాహలమనుకున్నారు! అదే జనవరి ఒకటి నాడు అబ్బో! పూలగుత్తులు, పండ్లబుట్టలు, కేక్ కట్టల్లు, ఓహ్! ఒకటేమిటి అంతా ఆనందం, పరమానందం మన చైత్ర శుద్ధ పాడ్యమినాడు కూడా యీ ఆనందాన్ని చూడలేము.




మా వూరిలో (విజయవాడ) వానగా వుండటంవల్ల పూల షాపులవారు, పండ్ల వ్యాపారస్తులు అమ్మకాలు అంత బాగా సాగక బాధపడ్డారట. దొరవారి దర్శనం చేసుకొని, వారికి నమస్కరించి పూలగుత్తులందించి పండ్ల బుట్టలోనికంపి కరచాలనం చేస్తే, వారు తమ కరుణా కటాక్ష వీక్షణాలను యీ ఏడాదంతా ప్రసరింప చేస్తారట. ఆంగ్లేయుల దొరతనం వదిలినా వారి అలవాట్లు మాత్రం మన జాతి జీవనంనుంచి వేరుపడలేదు. మరి మన పూర్వులంతా వారితో పోరాడి యీ దేశానికి స్వాతంత్ర్యం సంపాదించింది ఎందుకంటారు? కేవలం పరాయివాళ్ళను పారద్రోలి మనల్ని మనం పాలించుకునేందుకా? అంటే భౌతికమైన మార్పు అన్నమాట. తెల్లదొరల స్థానేకను నల్లదొరలు. అయితే ఉత్తరాదివారు మన దక్షిణాత్యుల కంటే కొంచెం తెల్లగా వుంటారనుకోండి! భగత్‌సింగ్ లాంటి నూనూగు మీసాల యువకులు చిరునవ్వుతో వురి కంబాలకెక్కింది మన బానిస భావాన్ని పారద్రోలటానికి కాదా? కాదు అనే విషయం ముందుగా వూహించి వుంటే అంతటి అఘాయిత్యానికి పాల్పడే వారు కాదు! పాపం, అల్లూరి సీతారామరాజులాంటి కొదమ సింగాలు విల్లంబులు చేతబూని పెనురంకె వేసింది. యీ బానిస మనస్తత్వాన్ని కూకటి వేళ్ళతో పెకలించటానికి కాదా? బాలగంగాధరతిలక్ వంటి ప్రాతఃస్మరణీయుడు 'వందే మాతరమ్' అని నినదిస్తే, ఆ పవిత్ర మంత్రాన్ని ఉచ్చరిస్తూ ఎందరు తుపాకీగుండ్లకు ఎదురు నిలువలేదు. ఎందరు ఆ కసాయి మూకల లాఠీదెబ్బలకు తమ శరీరాలను ఒప్పచెప్పలేదు!! మరెందరు లక్షలాదిగా కారాగారాలను నింపలేదు!!! మరి వీరందరి త్యాగ ఫలితం యీ దేశానికి సంపూర్ణ స్వరాజ్యం ప్రాప్తించాలనా? లేక గీతాచార్యుడు శెలవిచ్చినట్లు జీర్ణమయిన వస్త్రాన్ని వదలి నూతన వస్త్రం ధరించినట్లుగా పాతవారిని వదలి కొత్త వారిని గద్దె ఎక్కించటమా? వారి త్యాగాలన్నీ తెలుపును మార్చి నలుపును పులమటం కోసంకాదు. తరతరాల మన సంస్కృతీ వారసత్వాన్ని పదిల పరచటం కోసం, అనాదిగా పరిరక్షింపబడి కొడిగట్టుతున్న యీ దేశపు ధర్మజ్యోతిని ఆరనీయకుండా నిలిపి వుంచటం కోసం. ధర్మమే యీ జాతికి పునాది అనే సత్యాన్ని ప్రపంచానికి చాటి చెప్పటం కోసం: అందుకే స్వదేశీ భావనల గుబాళింపును నలుదెసల వెదజల్లటానికే విదేశీ వస్త్రాలను గుట్టలు గుట్టలుగా పోసి దగ్ధం చేసారు. వడికిన నూలు వస్త్రాలు ధరించారు. వారి ప్రతిక్రియ యీ

జాతి ధార్మిక సంపదను కాపాడటం కోసమే జరిగింది. అయితే దురదృష్టమేమంటే ఆ మహనీయుల త్యాగాలు, వారి బోధనలు మననం చేసుకోవటం మరిచిపోయాం. గతం శూన్యం, వర్తమానం అనే నీటిబుడగ శాశ్వతమని నమ్ముకొని జీవితాలు వెళ్ళమారుస్తున్నాం. అదేమిటని ఎవరైనా ప్రశ్నిస్తే కాలం మారిందండి! కాలంతోపాటు మనము కూడా మారాలి అనే వేదాంతాన్ని ప్రతిపాదిస్తున్నాం. ఈ మాటలు చెబుతుంటే ఓ కవి పలుకులు మదిలో మెదులుతున్నాయి. వాటిని గమనించండి.

కాలం మారిందని అరిచేవారంతా,
ఎందుకు మారిందో? ఎలా మారిందో?
ఎప్పుడు మారిందో? చెప్పు కోండి చూద్దాం
నీతిని నమ్మేవారిని బూతులు తిట్టినందుకు నిజం పలికే వారిని నిప్పుల్లో కాల్చినందుకు ధర్మం చేసేవారిని దానవుల్లో కలిపినందుకు పదవుల కొరకై మానం, ప్రాణం వదలినందుకు
నీరు నిప్పూ గాలి మార్చలేదు తమ గమనాల్ని
పగలు, రాత్రి, ఉషఃసంధ్యలు మార్చలేదు తమ రంగుల్ని
పూవూ కాయా పాడి పంటా వదలలేదు ధర్మాన్ని
సూర్యుడు, చంద్రుడు,చుక్కలు ఆపలేదు తమభ్రమణాలని
అయితే మారిందేమిటి? కాలం కాదోయ్ మనిషి।
నిజం వులికిపడే నీహృదయంలో కాలం కాదోయ్మారింది
నీలోని నైజం ''

ఆణిముత్యాల్లాంటి పలుకులివి, నిత్య స్మరణీయమయిన మాటలివి. మారిన వ్యక్తి నైజం కాలం మారిందనే భ్రమను కలిగిస్తున్నది. కాంతిని అడ్డుకున్న మబ్బులాంటిది యీ భ్రమ, కాంతి కిరణాల వేడికి మబ్బు కరిగినట్లుగా, చైతన్యపు హృదయంతో కళ్ళు తెరిస్తే భ్రమ తొలగి పోతుంది. ఆ చైతన్యం కావాలి నేడు. బానిసత్వపు భావాలను పెకలించి, పెళ్ళగించి, పూడ్చిపెట్టే చైతన్యం కావాలి. ఈ చైతన్యమే మన జాతి ధార్మిక జీవన మార్గంలో వున్న అడ్డుకట్టలను తొలగిస్తుంది. తద్వారా మన పూర్వులు ఆశించిన సంపూర్ణ స్వరాజ్యం యీ తరానికే కాదు రాబోయే తరాలన్నింటికీ దక్కుతుంది.

## "శ్రీవాణికి దివ్యాక్షతలు"

శ్రీల, వెలైడు రాణి శ్రీవాణి గీర్వాణి
దిగి వచ్చి నిల్చెనాఁ దేశవాణి.
కైలాసమును దాటి కామాక్షి వేంచేసె
కామి తమ్ములు గూర్చ ఖడ్గపాణి
వైకుంఠమును డిగ్గి-వీకమై నేతెంచె
పాల సంద్రము దాటి పద్మపాణి
సాహిత్య విజ్ఞాన సౌహార్ద రుచులతో
కావ్యసౌరభ మిచ్చు భవ్యరాణి
మంజుల సంగీత మాధురీమహిమల
ధరణి రూపించు, విధాతృ రాణి
శృంగార భావాల చిలికించి పలికించి
లీలలన్ దేల్చు వాల్మీకి వాణి
గంభీర ఫణితిలో, ఘనరత్న మాలికా
సౌందర్య మెఱిగించు మధుర వాణి
ఉత్తమోత్తమ పౌరులూహించు విజ్ఞాన
కళల నందించు యీ బాలవాణి
వనితల హృదయాల వలపులు చిగురింప
జనన మందిన యట్టి వనితవాణి
సర్వ ధర్మాలతన్ సౌవర్ణ కాంతులన్
వెదజల్లి శోభిడి వేల్పురాణి
భారత క్షో [illegible] భాషించు బాధ్యతా
యుత మైన గాథలన్, యువతవాణి
అంద రొకపరి వాణులై హర్ష మొసగి
పండువేడుక నాశిషల్ నియతిబల్క
సూర్య చంద్రులు తేజంబు చూపునంత
వరకు జగతిలో వెల్గు శ్రీవాణి వాణి
భారతాంబకు బంగారు పథము గూర్చి
నిత్య నూతన కాంతులన్ నెయ్యమూని
కొమర గిరివారి వైభవం బమరి వెలుగ
దివ్య తాక్షతల్ చల్లుడో భవ్యులార॥

మధురకవి
ముదిగొండ నాగమల్లికార్జునరావు

# భారతీయ సంస్కృతి-
# సామాజికస్పృహ

శ్రీ భాగవతుల కుటుంబరావు

1) అతిథి పూజ

ప్రాచీన భారతీయసంస్కృతిలోను, సాహిత్యము లోను సామాజిక స్పృహలేదు. వ్యక్తిగత మోక్షానికే ప్రాధాన్యము ఉన్నది అని ఆధునిక విమర్శలలో ఒకటి. ఆ అభిప్రాయము సరియైనదికాదు అని సూచనచేయటానికే ఈ వ్యాసములు.

తైత్తిరీయోపనిషత్తునందు కొన్నివాక్యములు సర్వకాలములకు, సర్వదేశములకు, మానవాళికంతకు అన్వయిస్తే! శిష్యుడు విద్యాభ్యాసము పూర్తిచేసి, గురువునొద్ద ఆశీస్సులుపొంది వెళ్ళేసమయంలో గురువుఇచ్చే సందేశము ఉపదేశము అమూల్యమైనది.

"మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ" "శ్రద్ధయా దేయమ్, అశ్రద్ధయాఽదేయమ్"

"తల్లిని, తండ్రిని, ఆచార్యుని, అతిథిని దేవునిగా పూజింపుము" "శ్రద్ధతో దానము చేయుము, అశ్రద్ధతో దానము చేయవలదు" ఇందు "అతిథిదేవోభవ" అను వాక్యము మనకు ప్రస్తుతమైనది. "అతిథి" అనుపదము అక్కరలో నున్నవారికి, ఆపదలలోనున్నవారికి, లేమిలో నున్నవారికిని ఉపలక్షణము. అనగా ఆపదము, వారిని గూడ బోధించును. అతిథికి అన్నము పెట్టుటయేగాదు, మిగిలిన విషయములలోగూడ, తన శక్తికొలది పేదసాదలకు, అర్థులకు సాహాయ్యము చేయవలయుననియే ఈ వాక్యమున కర్థము. అందువలననే తరువాతి కవులు "ఆపన్నార్తి ప్రశమనఫలాః సంపదోహ్యుత్తమానామ్" "పరోపకారాయ సతాం విభూతయః" "ఉత్తముల సంపదలు ఆపన్నుల ఆర్తిని పోగొట్టుటకే ఉద్దిష్టమయినవి" ఆసంపదలకు ఆపన్నుల బాధలను తొలగించుటయే ఫలము సత్పురుషుల యైశ్వర్యములు పరోపకారార్థము కొఱకేగాని కేవలము స్వార్థమునకేగాదు.

తైత్తిరీయములోనే ఇంకా కొన్ని వాక్యాలున్నై "న కంచన వసతౌ ప్రత్యాచక్షీత-తద్వ్రతమ్" "ఇంటికి వచ్చిన వారికి వసతిని తిరస్కరింపరాదు. ఇది ఒకవ్రతము శ్రీ శంకరులు దీనిని వివరించుచు ఇట్లనినారు. "వాసేచ దత్తే హ్యావశ్యమ్ అన్నందాతవ్యమ్-న నాస్తీతిప్రత్యాఖ్యానం కుర్వంతి యస్మాదన్నవంతో విద్వాంసః అన్నార్థినే అరాధి సంసిద్ధమ్ అస్మై అన్నమ్ ఇత్యాచక్షతే" "వసతిని ఇచ్చినపుడు అవశ్యము అన్నము పెట్టవలయును, విద్వాంసులైన వారు, అన్నార్థియై వచ్చిన వానికి అన్నము సిద్ధముగానున్నదని అందురు" అతిథికి వసతిని ఇచ్చి అన్నము పెట్టవలయును. ఇది వ్రతము. అని ఈ వాక్యములు విధించుచున్నవి.

కఠోపనిషత్తు నందు ఒక చిన్నకథ. నచికేతుడను బాలుడు. ఆయన తండ్రి "వాజశ్రవసుడు" "అన్నమును దానము చేయుటలో ప్రసిద్ధినందిన వాడు" అను నర్థమును వాజశ్రవ శబ్దము బోధించును. ఆయన తనకున్న సర్వస్వమును దానము చేయుటకు పూనుకొనినాడు. అపుడు ఎందువలన నైనగానిండు, ముసలి ఆవులను, పాలీయని ఆవులను గూడ దానము చేయుచున్నాడు. ఇది ఆయన కుమారునకు నచికేతునకు నచ్చలేదు. ఆవిషయమును సూచింపదలచి "నాన్నా నీ సొత్తునే అయిన నన్నెవరికిత్తువు" అని మూడుసార్లు అడిగినాడు. తండ్రికి కోపము వచ్చినది.

"యమునకు మృత్యువునకు నిన్నుఇచ్చుచున్నాను" అన్నాడు. నచికేతుడు యమలోకములో, యముని యింటికి వెళ్లినాడు. యముడు ఊరిలో లేడు. మూడుదినములవఱకు రాలేదు. ఈమూడు దినములు, నచికేతుడు, యముని యింటిలోని వారు బ్రతిమాలినను, అన్నము తినలేదు. ఉపవాసమున్నాడు. యముడు నాల్గవదినమున ఇంటికి వచ్చినాడు అప్పుడు ఇంటిలోనివారు ఆయనకు నచికేతుని విషయము చెప్పినారు. అతిధి ఉపవాస ముండుట వలన కలుగు అనర్థమును జ్ఞాపకముచేసినారు. "వైశ్వానరః ప్రవిశ్యత్యతిధిః బ్రాహ్మణోగృహాన్। తస్యైతాగ్ం శాన్తిమ్ కుర్వంతి హరవైవ స్వతోదకమ్ ఆశాప్రతీక్షే సంగతిగ్ం సూనృతాం చేష్టాపూర్తే। పుత్రపశూగ్ంశ్చ సర్వాన్, ఏతత్ వుంక్తే పురుషస్య అల్పమేధసః యస్య అనశ్నన్ వసతి బ్రాహ్మణోగృహే" వైశ్వానరాగ్నియైన (వైశ్వానరాగ్నివంటి) బ్రాహ్మణుడు అతిధి మనయింటి ఉపవాసము చేయుచు మూడు దినములున్నాడు. అర్ఘ్యపాద్యములిచ్చి, ఓయమా, ఆయనను శాంతింపజేయుము. లేనిచో మనము ఆశించిన కోరికలు ఫలింపవు. ఎదురుచూచుచున్న శుభములు కలసిరావు. సత్పురుషుల సహవాసము, సాంగత్యముల వలనః కలుగుఫలితములురావు. ఆదరముసత్కారములతో మనము మాట్లాడినందుకు (సూనృత వాక్యములకు) ఫలితము దక్కదు. యజ్ఞయాగాది (క్రతువులు, బావులు, చెరువులు వనములు మొదలైన వానిని నిర్మించి నందుకు ఫలములు దక్కవు పుత్రపశునష్టము కలుగును. అన్నియును నశించును॥ అతిధిని ఆదరించని వారికి కలుగు అనర్ధము ఈ వాక్యములలో స్పష్టముగా నున్నది. ఇంకొకటి కూడ గుర్తింప వలయును. "ఇష్టాపూర్తములు" అను పదము 'దిగుడుబావులు, చెరువులు, వనములు మొదలగు వాని నిర్మాణమును తెలుపును. వీని నిర్మాణము సమాజశ్రేయస్సునకే. అందువలననే వాని వలన పుణ్యము కలుగునని తెలియవలెను. ఈవిషయమును తెలిసిన యముడు నచికేతునితో అనినాడు "నీకు నమస్కారము, మూడుదినములు నాయింట ఉపవాసము చేసినావు. మూడువరములు కోరుకొనుము. నాకు స్వస్తి=క్షేమము అగుగాక' ఈ కథ యంతయు అతిధిపూజ యొక్క విశిష్టతను, ఉన్నవారు తమ సర్వస్వమును దానము చేయుటను తెలియచేయును.

పూర్వకాలము మన దేశములో ప్రతియింటికి ముందు అరుగు, పంచ (వరండా) యుండెడివి. ఇవి పొరుగూరి నుండి వచ్చిన వారికి ఎవరికైననుగాని, ఇతరులకు గాని, నిలువ నీడ తాత్కాలికముగా అవసరమైనవారికి గాని ఉపయోగించుటకే ఉద్దేశింపబడినవని గుర్తుంచుకొనవలయును. (ఇంకా వుంది)

నేను ఫస్ట్‌క్లాస్ 'కూపే'లోకి ప్రవేశించి అప్పటికి పది నిమిషాలైంది. ఏంచెయ్యాలో తోచటంలేదు. రైలు కదలటానికింకా అరగంట వున్నట్టుంది. వెంటవచ్చిన నౌకరు రైలు కదిలేవరకు వుంటానన్నా నేనేవద్దని పంపించేసాను.

కాఫీ, టీ అమ్మేకుర్రాళ్ళ అరుపులతోను, ప్రయాణీకుల హడావుడి కబుర్లతోను ప్లాట్‌ఫాం ఎంతోసందడిగా ఉన్నట్టుంది. కాని ప్లాట్‌ఫాం మీద జరిగే వింతల్ని చూసే అదృష్టం నాకులేదు. కారణం భగవంతుడు నాకు విధించిన భయంకరశాపం-అంధత్వం. నేను పుట్టుగుడ్డిని.

సృష్టికర్తకు నన్ను అంధుడిగా తయారుచేసిన తరువాత జాలికలిగిందేమో!! అందువల్ల నన్ను లక్షాధికారుల బిడ్డగా పుపించాడు. కోరినవన్నీ అందుబాటులో వున్న జీవితం. ప్రేమగాచూసుకునే తలిదండ్రులు. ఇంటినిండా నౌకర్లు. అందరినిమించి నాగురించే ప్రతిక్షణం ఆలోచిస్తూ నాతోనేలోకం అన్నట్టు బ్రతికే అక్క.

అక్కయ్యకు పుస్తకాలుంటే చాలు. ఇక లోకంలో మరేం అక్కరలేదు. ప్రతిపుస్తకాన్ని నాకు చదివి వినిపించేది. ఆవిధంగా నేనెంతోవిజ్ఞానాన్ని సంపాదించుకోవటమేకాకుండా వింతల్ని అర్థంచేసుకోగలిగాను.

అక్కయ్యకు చలం సాహిత్యం అంటే ప్రత్యేక అభిమానం. చలం వ్రాసిన పుస్తకాలేకాదు ఆయనవ్రాసిన ఒక్క అక్షరం కూడా మిస్ అయ్యేదికాదు.

చలం పుస్తకాల ద్వారా నేను మొట్టమొదటిసారిగా భీమిలిపట్నం గురించితెలుసుకున్నాను. ఆయన ఏనవలలో వర్ణించింది నాకు సరిగా గుర్తులేదు కా ని...అక్కడి చల్లని పిల్లగాలులు, సుతారంగావచ్చి ఒడ్డును తాకే అలలు, పల్లెకారు పాడే పడవ పాటలు, జీడిపప్పుతోటలు అన్నింటినిమించి అక్కడి ఎత్తైన ఎఱ్ఱమట్టికొండలు, వర్షపుజల్లుకు తడిసి అవిఅందించే మత్తైనవాసన....అంతా కలిసి అదేభూతలస్వర్గం అని ఆయన వ్రాసిన వర్ణన వినగానే వెంటనే భీమిలి వెళ్ళాలనిపించింది.

చెప్పాకదా మాఇంట్లో నాకు తీరని కోరికలేవి లేవని వెంటనేఅందరం కలసి భీమిలి వెళ్ళే ఏర్పాట్లు చేశారు నాన్న. అక్కడున్న వారం రోజుల్లో చలంగారి వర్ణనలను అక్కయ్య నోటిద్వారా చూడగలిగాను. అంతేకాదు జీవితం అంటూ గడిపితే భీమిలిలోనే గడపాలనే నిర్ణయానికి వచ్చాను.

నాకిష్టమైనప్పుడల్లా భీమిలి వెళ్ళి కొంతకాలం గడిపేందుకు, వీలుగా అక్కడో చిన్నఇల్లుకొని నౌకర్లనుఏర్పాటు చేశారు నాన్న.

అక్కయ్య పెళ్ళి చేసుకుని అమెరికా వెళ్ళిపోయింది. ఒంటరినై పోయాను జీవితంలో. అందుకే ఇప్పుడు




నా మకాం పూర్తిగా భీమలిలోనే.

అమ్మకు ఒంట్లో బాగోలేదంటే వచ్చి ఓ పదిరోజులు మద్రాసులో వుండి ఇప్పుడు భీమిలికి నాతిరుగు ప్రయాణం.

ఎవరోకూపేలోకి వచ్చినట్టైంది.

నా అంధత్వం వాళ్ళకు తెలియటం ఇష్టంలేక కిటికీవైపుకు ముఖం తిప్పుకున్నా. గుడ్డితనాన్ని భరించటం కన్నా గుడ్డివాడిమీద ఇతరులు చూపించే జాలిని భరించటం ఎంతకష్టమోనాకు తెలుసు.

కూపేలోకి వచ్చింది ఒక అమ్మాయి ఇద్దరు పెద్దవారు అని గొంతుల్ని పట్టి పోల్చుకోగలిగాను.

కిటికీలోంచి చేతులు బయటపెట్టవద్దని, మాట్లాడవద్దని, అవసరమైతే సంచీలోని బిస్కట్స్ తిని ప్లాస్కులోని కాఫీ తాగమని.... ఎన్నో సలహాలిస్తున్నారు ఆ అమ్మాయికి.

గొంతును బట్టి ఆ అమ్మాయి వయసు ఇరవై వుంటుందని ఊహించా ఆసలహాలివ్వటం బట్టి ఆ అమ్మాయి ఒంటరిగా ప్రయాణం చేస్తున్నదని, ఆవచ్చిందిఆఅమ్మాయి పిన్ని, బాబాయ్ అని అర్థం చేసుకున్నా.

రైలు కదలబోతుండగా హెచ్చరికలన్నీ మరోసారి గుర్తుచేసి దిగిపోయారు ఆఇద్దరూ.

నెమ్మదిగా బయలు దేరి వేగం అందుకుంది రైలు.

కిటికీవైపునుంచి ఎదురు బెర్త్ వైపు తలతిప్పాను.

కాని... ఏముంది అక్కడ! గడచిన పాతికేళ్ళుగా నా కళ్ళముందు నిత్యం తాండవిస్తున్న శూన్యం.

ఆచీకటి సముద్రంలోనే ఆఅమ్మాయిఆకారం ఊహించాలనే పిచ్చిఆలోచన బయలుదేరింది. ఆతరువాత నేనెంత కరెక్ట్‌గా ఊహించగలిగింది ఆమెతోచెప్పి ఉక్కిరి బిక్కిరి చెయ్యాలనే చిలిపి తలంపునాది.

తెల్లటికోలముఖం, పెడల్పుకళ్ళు, కొనదేలిన చక్కటి పెదవులు సన్నని నడుము, అటూ ఇటూ కదులుతుండే చెవిరింగులు, అందంగా కట్టుకున్న చీర, జారాడేకుచ్చిళ్ళు. పొడవైన జడ....జడేనా! తీన్ మోడ్రన్ అమ్మాయిలా భుజం మీదికి వేళాడే జుట్టా!!

ఆ అనుమానంతో నాఊహ ఆగిపోయింది.

ఆఅమ్మాయి ఇప్పుడేం చేస్తుంటుంది! అని అనుకున్నా. నా అనుమానం నాకే నవ్వుతెప్పించింది.

కళ్ళున్న ఏవ్యక్తి అయినా ఏంచేస్తుంటాడు! ఎంచక్కా ప్రకృతిని ఆస్వాదిస్తుంటారు.

ఎదురు బెర్త్ మీద ఎవరో జరిగిన శబ్దమైంది

బహుశబెర్త్ కు ఆలవోకగా చేరగిలి కిటికీలోంచి బయటకు చూస్తున్నదేమో!!

ఆఅమ్మాయిని పలకరిస్తే!!

...రాజకీయం!

కోడళ్ళు ఒళ్ళు పచ్చడయినా సరే
కొడుకుల శరీరం గాసిల్లకూడదు!
అది — "అత్తగారి న్యాయం" !
దరిద్రుల రెక్కలు ముక్కలయినాసరే
ధనవంతుల కడుపులో చల్ల
కదల కూడదు!
ఇది — ఈ దేశం రాజకీయం !!

— కె. కిశోరుబాబు

— కె. అశోకుబాబు

మాట్లాడుతుందో లేదో. గుడ్డివాడివి నీతోనాకు మాటలేమిటి అంటే!!! అయినా అంత అందమైన అమ్మాయికి నాలాంటి అభాగ్యుడి అవస్థ అర్థంచేసుకునే మనసుండదా!

చాలా సేపు తర్జనభర్జన పడింతరువాత పలకరించకుండా వుండలేకపోయాను.

"మీరు ఎక్కడివరకు వెళుతున్నారు" అడిగాను ఎంతో నెమ్మదిగా.

నాప్రశ్నకు ఆఅమ్మాయి కొంచెంకంగారు పడినట్టుంది

"మీరు... మీరు.... మీకూపేలోకి ఎప్పుడు ఎక్కారు" అంది కంగారుగా.

నా మనస్సు చివుక్కుమంది. కంపార్ట్‌మెంట్‌లో మొదటి నుంచివున్న నన్ను ఇంతవరకు గమనించ నందుకు.

అవును... ఆవిడకు అంతఅవసరమేముంది.భగవంతుడు ఆవిడకిచ్చిన కళ్ళు నాలాంటి గుడ్డివాణ్ణి గమనించటానికి కాదు. ప్రకృతిని ఆనందించటానికి.

నాకు కళ్ళు లేవనే విషయం ఆవిడకు ఇప్పటికైనఆర్థమవ్వాలని "నేను మీరు కంపార్ట్‌మెంటులోకి రావటం చూడలేదు. తెలుసుకున్నా నంతే" అన్నాను.

నా మాటల్ని ఏమాత్రం పట్టించు కోకుండా "నేను.... నేను కాకినాడ వెళ్ళాలండీ సామర్లకోట స్టేషన్‌కి మానాన్నగారు వచ్చిరిసీవ్ చేసుకుంటారు" అన్నది.

నాతో మాటలు పొగించటం ఇష్టంలేక ఇచ్చినసమా

ధానంలా అనిపించింది. అయినా సంభాషణ పొడిగించాలని "వాల్టేర్ వెళుతున్నానండి. అక్కడనుండి భీమిలివెళ్ళాలి" అని చెప్పా.

"ఆ... భీమిలా" ఆ అమ్మాయి ముఖంలో కొట్టొచ్చిన ఆశ్చర్యాన్ని నేను ఊహించుకున్నా. "ఎంత అదృష్టవంతులండిమీరు. భీమిలి వాతావరణం ఎంతో బాగుంటుందటకదా! భూతల స్వర్గమటకదా!" అన్నది.

మాఇంటి వరండాలో కూర్చుని ముఖేష్‌పాటలు వింటూ నా ఊహల్లో అనుభవించిన భీమిలినంతా ఏకరువుపెట్టాను.

ఆఅమ్మాయిలో ఎలాంటి రియాక్షన్ వచ్చిందో అర్థం కాలేదు. కారణం ఎలాంటి సమాధానం రాకపోవడమే.

పదినిమిషాలు మౌనంగా గడిచాయి.

ఎదురుగా ఒక వ్యక్తి వుండగా మాట్లాడకుండా కూర్చోవటం ఎంత కష్టం. అందులోను నాలాంటి అభాగ్యుడికి కబుర్లే కదా కాలక్షేపం. కాని ఏం మాట్లాడాలి

ఎక్కడో ఉరిమిన శబ్దమైంది.

బయట "వాతావరణం ఎలా ఉందండీ" అని అడిగాను.

"నన్నడగటం ఎందుకూ!! మీరే చూసి తెలుసుకో వచ్చుగా" చాలా విసురుగా ఇచ్చింది సమాధానం.

ఏమిటీ అమ్మాయి ఉద్దేశ్యం!

నేను చూడలేననే విషయం ఇప్పటికి అర్థంచేసుకోలేదా లేక తెలిసి వెక్కిరించటమా!!!

తలతిప్పి కిటికీలోంచి బయటకుచూస్తున్నట్లుగా కొద్దిసేపు నటించి "మాశారా ఈ తమాషా.... మన రైలు ముందుకు వెళుతుంటే ఆ చెట్లు, టెలిఫోన్ స్థంబాలు వెనక్కు పరిగెడుతున్నాయి." అన్నాను. ఏంచెయ్యను. నాకు తెలిసిన విషయం అదొక్కటే.




"అందులో వింతేముంది. చాల సహజం." అన్నది ఆ అమ్మాయి మరింత నిర్లక్ష్యంగా.

నాకు ఒళ్ళు జలదరించింది. ఏ విషయం కదలించినా ఎందుకిలా ముగుస్తున్నది. మా సంభాషణ.

రైలు చేసే లయబద్ధమైన శబ్దంవింటూ వుండిపోయాను కొద్ది సేపు.

మా పరిచయం అలా చేదుగా మిగిలిపోవటం నాకిష్టం లేదు. ఏటాపిక్ మీదికి మళ్ళిస్తే బాగుంటుందా అని ఆలోచిస్తుంటే.... ప్రపంచములో ఏస్త్రీ అయినా ఆవిడ అందం గురించి మాట్లాడితే ఆనందిస్తుందని ఎక్కడోఎప్పుడోవిన్న మాట గుర్తొచ్చింది.

"మీదెంతో అందమైన ముఖమండీ"అన్నాను.

"ఆ విషయం చెప్పిన వేలాది మందిలో మీరొకరు" ఠక్కున వచ్చింది. సమాధానం.

ఇక నాకు నోట మాట రావడం మానేసింది.

మా పరిచయం ఆనందంగా ముగియాలని నేను చేసిన ప్రయత్నాలన్ని విఫలమయ్యాయి.

బహుశ నన్ను, నేను పడిన అవస్తని తనఫ్రెండ్సందరికి చెప్పి నవ్వుకుంటుందేమో కొద్ది రోజుల పాటు.ఆ తరువాత క్రమంగా మరచిపోతుంది. కాని నాకుజీవితాంతం గుర్తుంటుంది ఈ సంఘటన. ఆ అమ్మాయి నా చెవ్వుల్లో గింగుర మంటూనే వుంటుంది.

ట్రైన్ చేస్తున్న శబ్దంయొక్కలయలో మార్పువచ్చింది. చక్రాలు కీచుమంటు పట్టాలు మారుతున్నాయి. స్టేషన్ వచ్చేస్తున్నాం అని దిగాల్సిన వాళ్ళకు వార్నింగిస్తున్నది. రైలు.

నెమ్మదిగావచ్చి ప్లాట్‌ఫాం మీద ఆగింది రైలు. మళ్ళీ కాఫీ టీల కేకలు ప్రయాణీకుల హడావుడి.

ఆ అమ్మాయి దిగటానికి లేచిన అలికిడైంది.

అయితే ఆ అమ్మాయి జడ ముందుకు వేసుకుందా లేక వెనక్కివుందా, అసలు ఆ అమ్మయిది జడా! లేక మోడ్రన్ బఫ్‌నా!! ఇంతకు ముందు ఎక్కడ ఆగిపోయిందో అక్కడికే వెళ్ళింది నా ఆలోచన.

"జాగ్రత్తగా దిగమ్మా" అంటున్నారు ఎవరో బయట నుంచి.

ఇంతలో ఎవరో ఇద్దరు వ్యక్తులు డీకొన్న శబ్దం "సారీ" అనే మగ గొంతుక వినిపించాయి డోర్ దగ్గర నుంచి.

ఏం జరిగుంటుందోనని నేను ఊహించేలోగా మరో ప్రయాణీకుడెవరో ఆ అమ్మాయి ఖాళీచేసిన బెర్త్‌మీద సామాన్లు సర్దుకుంటున్న ధ్వని వినిపిస్తున్నది.

అంతలో నాకో అయిడియా తట్టింది.

నన్నింతవరకు వేధించిన అనుమానం—ఆఅమ్మాయిది జడో, క్రాపో—ఈతన్ని అడిగి తెలుసు కుంటే!

"ఇప్పుడు దిగిన అమ్మాయిది జడా లేక క్రాఫాండి" వుండబట్ట లేక అడిగాను.

"సారీ... నేను సరిగా చూడలేదు. నన్ను ఆకర్షించింది ఆ అమ్మాయి పెద్దకళ్ళు మాత్రమే. కాని విధాత ఎంత దయలేనివాడు.

ఆవిడకి ఎందుకు పనికిరావి విశాల నేత్రాలు. ఆవిడ గుడ్డిది....."

నాకేం వినపడటం లేదు.

నా ఊహాసుందరి విగ్రహం ఒక్కసారిగా బద్దలై చీకట్లో అలుక్కుపోయింది.

నాశరీరంలోని రక్తమంతా ఒక్క సారిగా బయటకు విరజిమ్మినట్టైంది.

భరించ లేని నీరసం ఆవహిస్తుంటే నెమ్మదిగా బెర్త్ మీద వాలిపోతుంటే నాగుడ్డికళ్ళ కొసల్లోంచి వెచ్చటి కన్నీరు తన్ను కొస్తుంటే.... అప్పుడు నాకర్థమైంది నా "ఊహాసుందరి" నా మాటలకు అలా ఎందుకు జవాబిచ్చిందో.

(Ruskin Bond వ్రాసిన ఒక ఆంగ్ల కథకు ఆధారంగా)

# వెలుగుబాట చూపించిన తెలుగునాడు

## కురుతే...

మంగళగిరి ప్రమీలాదేవి

అన్నది ఆర్యోక్తి!

కావ్యరచన ఒక పవిత్రమైన తపస్సు. మనోవీధిని మహిత ప్రకాశభూమిగా చేసే తేజోమయదీప్తి కావ్యం తపోవిభవ సంపన్నులు, ఋషితుల్యులు ఐన వారిచే తప్ప కావ్యం నిర్మించబడదు! అని ఆవాక్యానికి అర్థం. దాని పవిత్రమైన లక్ష్యం ఒక్కటే. అది విజ్ఞాన ప్రకాశాన్ని జగతికి అందించటమే. అటువంటి మహత్తరమైన, బృహత్తరమైన కార్యక్రమానికి ఉద్యమించినవారు మనతెలుగు వాఙ్మయంలో కూడా ఎందరెందరో ఉన్నారు. అందులో అందరికీ వందనీయుడు ఆద్య పూజ్యుడూ, ఐనవాడు నన్నయ్యకవి.

శ్రీవాణీ గిరిజాశ్చిరాయదధతో వక్షోముఖా జేషుయే
లోకానాం స్థితి మావహన్త్య విహతాం స్త్రీపుంస యోగో
ద్భవామ్,
తేవేదత్రయ మూర్తయ స్త్రిపురుషా స్సంపూజితా
వస్సురై
ర్భూయాసుః పురుషోత్తమామ్బుజభవ శ్రీకన్ధరా శ్రేయసే

అని నన్నయగారు సంస్కృత భాషలో శ్రీవాణిని స్తుతిస్తూ తెలుగులో భారతం వ్రాయ బూనారు. నిజంగా వాణి వీణా నిక్వణనం చేసింది. ఆమె చేతిలోని వీణపై తెలుగుదనం ప్రస్తరించింది. ఆవీణా ప్రసారం ప్రారంభమై ప్రారంభమై షుమారు నేటికి 950 సంవత్సరాలయింది. అది ఆతరువాత తెలుగు తోటలో వెలుగుపూలు వికసింప చేయటానికి కారణ భూతమయింది. తెలుగునాడు నాడు నాలుగు చెరగులా మాధుర్యాన్ని అందించిన శుభవేళ అది

భారతీయ విజ్ఞాన సర్వస్వంగా ప్రసిద్ధిచెందిన మహాభారతం ఆంధ్ర వాఙ్మయంలో ఆది కావ్యంగా అవతరించడం ఆంధ్రజాతికి పట్టిన అదృష్టం. అంతేకాదు. అది అద్వితీయమైన కవితా శిల్పంతో శోభించటం కూడా అటువంటిదే.

ఆంధ్ర భారతావతరణం అంటే ఎవరో ఓ కవి మారుమూల తన ఇంట్లో కుర్చొని తన కోరికమేరకు ఒక కావ్యాన్ని రచించటం కాదు. అది ఒక పవిత్రమైన క్రతువు. తెలుగు భాషా క్రతువు.

తన కాలం నాటి రాజకీయ, మత; భాషా సారస్వత స్థితి గతుల్ని బట్టీ రాజరాజు మహాభారతాన్ని తెలుగులోకి అనువదింపచేసి సంస్కృతం రాని సామాన్య ప్రజానీకానికి అందజేయాలని సంకల్పించాడు. ఆసంకల్ప బలమే నన్నయ భట్టారకునివంటి మహాకవిని ఆంధ్రులకు అందించింది.

రాజరాజ నరేంద్రుడు తన సకల భువనలక్ష్మివిలాస నివాసంలో పండితులతో గోష్ఠి జరుపుతున్నాడు. ఆసభలో మంత్రుల పురోహితులూ ఇత్యాది రాజ పరివారం చేత పరివేష్టితుడై ఉన్నాడు. వ్యాకరణంలో పాండిత్యం గల వయాకరణులు భారతం, రామాయణం ఇత్యాది పురాణాలను బాగా చదువుకొన్న పౌరాణికులూ, తర్కాది సమస్త శాస్త్రములలో ప్రతిభావంతులైనవారు నవార్థవచన రచనలో దిట్టలైన కవులూ ఉన్నారు. వైణికులూ ఇత్యాది కళావతంసులూ ఉన్నారు. విద్వజ్జన పరివేష్ఠితుడైన రాజరాజు గోష్టి జరుపుతు ఆనందిస్తున్నాడు ఆ సమయంలో తన మనసులోని కోరికను బయట పెట్టాడు. విమల మదితో అనేక పురాణాలు విన్నప్పటికీ అనేక ధర్మశాస్త్రాలు చదివినప్పటికీ తెలుగులో మహా భారతాన్ని వినాలన్నది రాజ రాజు ప్రకటించిన ఆకోరిక.

సంస్కృతాంధ్ర భాషా విశారదుడూ, వేదధర్మ పరమార్థాన్నీ, మహా భారత తత్వాన్ని సమగ్రంగా అర్థం చేసుకొన్నవాడూ, అపారప్రతిభా సంపన్నుడు,విజ్ఞాన నిరతుడూ ఐన నన్నయ్యగారు మాత్రమే ఈవాఙ్మయ మహాక్రతువును నిర్వహింప గలవాడని అనుకొన్నాడు,రాజరాజనరేంద్రుడు. తన చుట్టూఉన్న పండిత పరిషత్తును పరిశీలించాడు. ఈ లక్షణాలన్నీ మూర్తీభవించిన వాడుగా నన్నయ్యగారు ఒక్కరే కనిపించారు. ఆయనే తెలుగుభాషకు వెలుగు చూపగల వేగుచుక్కగా భాసించాడు రాజరాజుకు. అందుకనే కృష్ణద్వైపాయనుడు సంస్కృతంలో రచించిన మహాభారతాన్ని అర్థనిరూపణ చేస్తూ తెలుగులో రచనచేసి ఆంధ్రుల కందించమని నన్నయ్యగారిని కోరాడు. ఆ భారత భారతీ సముద్రాన్ని ఈదటం కష్టమని తెలిసినా ఆనతిచ్చినవాడు. తనకు అత్యంత ప్రీతిపాత్రుడైన రాజరాజ నరేంద్ర భూపతి కనుక ఆ ఆనతిని శిరసావహించారు నన్నయ్యగారు.

తెలుగులో కావ్యనిర్మాణంచేయాలనే సంకల్పంఅయితే మంచిదే. కాని నన్నయ్యగారి కానాడు భారత రచనలో అనేక సమస్యలు ఎదురైనాయి.ఆనాడుఆయనఎదుర్కొన్న వాటిలో భాషాసమస్య, పండితుల సవాళ్లు చెప్పుకోతగ్గ సమస్యలు.

భారతంవంటి ఉత్తమ కావ్యాన్ని రచించటానికి అనువైన పదజాలం. ఆనాటి తెలుగుభాషలో తగినంతగా లేదు. ఉన్నదైనా అస్తవ్యస్థంగాఉంది.కావ్యం లోని రసభావాలకు అనుగుణమైన కొత్తపదాలను ఎంచుకోవాలి. కొత్తపదాలను సంస్కృత పదాలుఆధారంగా సృష్టించుకోనైనాసృష్టించుకోవాలి, అస్థవ్యస్థంగా ఉన్న పాత పదజాలాన్ని సువ్యవస్థీకరించటమైనా చేయాలి.రెండూచేస్తేనే కానికావ్యరచనకు అనువైన భాష దొరకదు.

నన్నయగారికి అక్కడ గల పండిత సభపై గౌరవం ఎక్కువ. పంచమ వేదమని పేరు పొందిన మహాభారతం వంటి పవిత్ర గ్రంధాన్ని దేవభాషనుండి దేశభాషఐన తెలుగుభాషలోకి అనువాదం జరగటం పండితులకి పెద్దగా నచ్చినట్లు కనిపించదు. రాజు అనుమతితో భారతాన్ని ప్రారంభించారు. కనుక పండితులు తమ వ్యతిరేకతను ప్రకటించ లేదు. నన్నయ్యగారికి ఆనాటి పండిత సభపై గౌరవం ఎక్కువ తానుచేసిన భాషా ప్రయోగాలు,కావ్యభాగాలూకూడా విద్వత్సభలలో వినిపించి వారి ఆమోదాన్ని పొందేవారు. వారికి నచ్చచెప్పటంలోనూ, భాషాపరమైన వివరణ చేయటంలోను నారాయణభట్టు'పాయక పాకశాసనునికి భారత ఘోరరణంబు నందు నారాయణునట్లు''తోడ్పడ్డాడు.

ఈ భాషాయుద్ధంలో నన్నయ్యగారు ఒక విధంగా విజయాన్ని సాధించారనే చెప్పచ్చు. ఆయన శబ్దానుశాసనత్వానికి సార్థకత కలిగింది. ఉత్తమమైన మొదటి కావ్యం వ్రాసింది వీరే కనుక ఆదికవి అయ్యారు.

నన్నయగారి భారతం అనువాదమైనా రచనలోప్రత్యేక శ్రద్ధ తీసుకొన్నారు. ధర్మోపదేశంలో ఎంత శ్రద్ధ తీసుకొన్నారో రసపోషణలో కూడా అంతేశ్రద్ధ వహించారు. మూలంలోలేని సూక్తులను కూడాఆంధ్ర మహా భారతంలో చొప్పించి నానారుచిరార్థ సూక్తినిధి అయ్యారు, నన్నయ్యగారు భారతంలో వాడిన సూక్తులు-'వృద్ధుల బుద్ధులు సంచలింపవే,'' సిద్ధుల చరితంబులల్పులకు నెరుగ శక్యమే వంటివి సామెతల్లాగా రూపొంది నేటికీ ప్రజల మధ్య ప్రచారంలో ఉన్నాయి.

నన్నయగారి భారతం సొగసుల పేటిక. వీరి ప్రసన్నకథా కవితార్థయుక్తిని వివరిస్తూ విశ్వనాథ వారన్నారు. "ఆంధ్ర భాషకు నన్నయ్యగారు పెట్టేందిభిక్ష. తక్కిన కవులందరూ నన్నయ్యగారి నుంచి భాషాశబ్దములూ ఒడుపులూ గ్రహించినవారే.'' అని ఈ అభిప్రాయం అందరికీ ఆమోద యోగ్యమయినదే.

కనుక తెలుగు వాఙ్మయ సదనానికి పునాదివేసిన నన్నయ్యగారి కావ్యరచనా తపస్సు తరువాత కాలంలో ఆంధ్రభాషా వికాసానికి దారి చూపింది అనటంలో ఆంధ్రులందరిదీ ఒకే అభిప్రాయం.

# గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలు-ఒక సమీక్ష

డా. ఐ. సత్యసుందరం

గత మూడు దశాబ్దాలలో గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలను అమలుపరచుటలో భారతదేశము అనుభవము సంపాదించినది. ఈ అనుభవాన్ని దృష్టిలో ఉంచుకొనే ప్రస్తుతము గ్రామీణాభివృద్ధి గార్యక్రమాలు అమలుపరచబడుచున్నవి. గ్రామీణాభివృద్ధి ద్వారానే దేశంలో దారిద్ర్యము, నిరుద్యోగము నిర్మూలించగలము. అందువలనే ప్రస్తుతము గ్రామీణాభివృద్ధికి మనప్రణాళికలలో ప్రత్యేక ప్రాధాన్యత ఇవ్వబడుచున్నది. ప్రజలలో షుమారు 76 శాతం గ్రామ ప్రాంతాలలో నివసించుచున్నారు. వీరి ఆర్థిక, సాంఘిక స్థాయి పెంచనిదే అభివృద్ధికి అర్థంలేదు. ప్రస్తుతం దేశంలో 40 శాతం ప్రజలు దారిద్ర్యరేఖకు అడుగుననున్నారు.

గ్రామీణ వాతావరణము అభివృద్ధికి అనుకూలంగాలేదు. భూమి, ఇతర ఉత్పత్తి సాధనాలు కొంతమంది చేతుల్లో కేంద్రీకృతమైనది. అందువలన; ప్రభుత్వం సమకూర్చే సదుపాయాలు కాస్త ఆర్థిక స్తోమత గలవారే పొందుట జరిగెను. 1978_79 నాటికి గ్రామీణాభివృద్ధి వ్యూహములలో మార్పు వచ్చినది. సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకం ద్వారా గ్రామీణాభివృద్ధి సాధించుటకు కృషి జరిగినది. బ్లాకుస్థాయి ప్రణాళికలకు ప్రాధాన్యత ఇవ్వబడినది. భారతదేశం లాంటి పెద్ద దేశంలో దారిద్ర్య, నిరుద్యోగ సమస్యలు, బ్లాకుస్థాయి ప్రణాళికల ద్వారా మాత్రమే పరిష్కరించగలమని ప్రభుత్వం భావించినది.

వ్యవసాయ, వ్యవసాయేతర కార్యక్రమాలను సమన్వయ పరచి ప్రాంతీయ స్థాయిలో ఉద్యోగావకాశాలతోపాటు ఉత్పత్తిని పెంచుట సమగ్ర గ్రామీణాభివృద్ధి ముఖ్య ఆశయం. పేద ప్రజలకు ఆదాయాన్నిచ్చే సాధనాలు సమకూర్చుటయేగాక, వారికి కావలసిన ఇతర సేవలకు ప్రాధాన్యత ఇవ్వబడుచున్నది. లేనిచో; ఒకసారి పేదరికం నుండి బయట పడినవారు మరల పేదరికానికి గురి అయ్యే ప్రమాదం ఉంది. ఆరవ ప్రణాళికలో (1980_85) సమగ్ర గ్రామీణాభివృద్ధి కార్యక్రమం క్రింద ప్రతి బ్లాకులో 3,000 పేద కుటుంబాలను (సంవత్సరానికి 600 కుటుంబాలు) దారిద్ర్యంనుండి విముక్తి చేయవలసివున్నది ఈ కార్యక్రమం ముఖ్యంగా సబ్సిడీల ద్వారా, బ్యాంకు ఋణాలద్వారా అమలుపరచబడుచున్నది.

బ్లాకు స్థాయిలో అభివృద్ధి కార్యక్రమాలు అమలుపరచుటలో ప్రత్యేక శ్రద్ధ చూపాలి. ప్రాంతాల ఆర్థిక, సాంఘిక పరిస్థితులతోపాటు, ప్రజల అవసరాలు దృష్టిలో ఉంచుకోవాలి. అమలుపరచే కార్యక్రమాలు ప్రాంతీయ ఆర్థిక వ్యవస్థను పటిష్టంచేయాలి. ఉపాధి కల్పించుటే ముఖ్యం కాదు. ఉత్పాదకత, ఉత్పత్తి పెంచాలి. వేతనాల స్థాయి తగురీతిలో ఉండాలి, శాశ్వతంగా ఉపాధి కల్పించే కార్యక్రమాలకు ప్రాధాన్యత ఇవ్వాలి. వ్యవసాయ రంగానికి, ఉపయోగపడే పరిశ్రమలకు ప్రాధాన్యత ఇవ్వాలి.

బ్యాంకు ఋణాలు :

గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలను అమలు పరచుటలో బ్యాంకు ఋణాలకు ప్రత్యేక స్థానం ఉన్నది. కొన్ని వర్గాల పేద ప్రజలకు ప్రస్తుతము 4 శాతం వడ్డీరేటుకే ఋణాలు సమకూర్చబడుచున్నవి. అయితే, ఋణాలు సమకూర్చుట ముఖ్యంకాదు. ఇచ్చిన ఋణాలు సక్ర

మంగా వినియోగించుట అత్యంత ముఖ్యము. ప్రస్తుతము ఋణాల చెల్లింపు సరిగాలేదు. కారణం, పేద ప్రజలు తమ ఆదాయస్థాయిని పెంచుకొనలేకపోవుట కొందరు ఆదాయాలు పెంచుకొన్నా, ఋణాలు చెల్లించుట లేదు. (చెల్లించనక్కర్లేదన్న అభిప్రాయం వాళ్ళలో ఉన్నది). ఈ పరిస్థితి మారాలి. ప్రజల సొమ్ము దుర్వినియోగ పరచుట ఎవరికి మంచిది కాదు.

ప్రస్తుతము లీడ్ బ్యాంకు స్కీమ్ అమలులో ఉన్నది. ప్రతి జిల్లాలో జిల్లా అభివృద్ధికి కావలసిన పరపతిని అంచనావేసి, ఆ పరపతిని సమకూర్చే బాధ్యత ఒక బ్యాంకుకు అప్పగించబడినది. అంటే, వివిధ బ్యాంకుల కార్యక్రమాలు ఈ బ్యాంకు సమన్వయ పరచును. జిల్లా స్థాయిలో పరపతి ప్రణాళికలను బ్యాంకులు రూపొందించు చున్నవి. అయితే, జిల్లా, బ్లాకుస్థాయిలలో ఆర్థిక ప్రణాళికలు లేకుండా ఈ పరపతి ప్రణాళికలు తయారు చేసు కొనుటవలన ఆశించిన ఫలితం ఉండదు. అంటే, బ్యాంకులు ఆర్థిక ప్రణాళికలు తయారుచేసే సంస్థలతో సన్నిహితంగా ఉండాలి.

ప్రయోజనదారులను ఎన్నుకొనుట :

ప్రయోజనదారులను ఎన్నుకొనుటలో అనేక అవకతవకలు వినవచ్చుచున్నవి. ఇందువలనే బ్యాంకు ఋణాలను తిరిగి రాబట్టుకొనుట సమస్యగా ఉన్నది. ప్రతి కార్యక్రమం క్రింద ప్రయోజనదారులను ఎన్నుకొనుట ప్రభుత్వ శాఖలకు అప్పగించుట మంచిదికాదు, అనేక కార్యక్రమాలను సమీక్షిస్తున్నప్పుడు కొంత ఆర్థిక స్తోమత గలవారే ప్రయోజనాలను పొందినట్లు తెలిసినది. ఈ పరిస్థితి మారి ప్రయోజనము పొందుటకు సరియైన వారిని ఎన్నుకోవాలంటే, ప్రభుత్వం స్వచ్ఛంద సంస్థలపైన, ప్రజలకు దగ్గరగావున్న నాయకులపైన ఆధారపడాలి. వనరులు పరిమితంగా ఉన్నపుడు ప్రయోజదారులను ఎన్నుకొనుటలో ఎక్కువ శ్రద్ధ చూపాలి.

ప్రస్తుతము ప్రయోజనదారులను ఎన్నుకొనే బాధ్యత జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థలు చేపట్టినవి. ప్రయోజనదారుల అవసరాలను, వారి నిజాయితీని, ఈ సంస్థలు బాగా పరిశీలించాలి. కొంత ఆర్థిక స్తోమత గలవారిని ఎన్నుకొనినచో, ఎక్కువమందిని తక్కువ కాలంలో దారిద్ర్యంనుండి విముక్తి చేయవచ్చునని ప్రభుత్వసంస్థలు భావించును. అయితే, సమాజంలో అట్టడగుననున్న వారిని ఎన్నుకొని వారికి ఉపాధి కల్పించవలసిన అవసరం ఎంతైనావుంది.

సమగ్ర గ్రామీణాభివృద్ధి :

ప్రయోజనదారులకు ఏదో ఒక ఉపాధి కల్పించిన చాలదు. వారికి కావలసిన ఇతర సేవలను కూడా సమకూర్చాలి. ఉదాహరణకు, పాలనిచ్చే రెండు గేదెలను ఒక కుటుంబానికి ఇచ్చిన సరిపోదు. పశువులకు వైద్య సౌకర్యం, పశుగ్రాసము సమకూర్చాలి. పాలు మార్కెట్ చేసుకొనే అవకాశం కల్పించాలి. సమగ్ర గ్రామీణాభివృద్ధి పథకం ఈ రీతిలో అభివృద్ధిని కొనసాగించుటకు కృషి చేయుచున్నది. వ్యవసాయ, వ్యవసాయేతర కార్యక్రమాలు మధ్య సమన్వయం, అభివృద్ధికి సహాయపడే శాఖలు, సంస్థల కార్యక్రమాలలో సమన్వయం ఏర్పరచుటకు కృషి జరుగుచున్నది. అభివృద్ధి కార్యక్రమాలు అనుకొన్న రీతిలో పనిచేయుచున్నది, లేనిది తరచు సమీక్ష చేసి; లోపాలుంటే వాటిని వెంటనే నిర్మూలించాలి.

సంస్థల ద్వారా మాత్రమే పేదప్రజలు ప్రయోజనాలను పొందగలరు. అయితే, సరియైన సంస్థలను ఎన్నుకొనుట ముఖ్యము. కేవలం పరపతే కాకుండా, ఇతర సేవలను సమకూర్చే సంస్థలద్వారా పేదప్రజలు ప్రయోజనాలు పొందితే బాగుంటుంది. ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థల సేవలను వినియోగించుకోవాలి. బ్లాకు స్థాయిలో కార్యక్రమాల ప్రగతి సమీక్షించుటకు ఒక సంస్థవుండాలి. ఈ సంస్థలో ప్రభుత్వ ప్రతినిధులతోపాటు, బ్యాంకులు, స్వచ్ఛంధ సంస్థలు, ప్రయోజనదారుల తరపున ప్రతినిధులుండాలి. సరియైన కార్యక్రమాలను రూపొందించుటే కాకుండా, వాటిని సక్రమంగా అమలుపరచే బాధ్యత ఈ సంస్థ చేపట్టాలి. అభివృద్ధి కార్యక్రమాలలో ప్రజలు విరివిగా, ఉత్సాహంగా పాల్గొనాలి. ప్రజలు, ప్రభుత్వ సంస్థల సహాయం పొందవచ్చును. అయితే ఎప్పటికైనా తమ కాళ్ళపై తాము నిలబడటానికి ప్రజలు ప్రయత్నించాలి. అప్పుడే నిజమైన గ్రామీణాభివృద్ధికి అవకాశం ఉండును.

# ధన్యజీవి శ్రీ శాస్త్రి

చేగిరెడ్డి సత్యనారాయణరెడ్డి
M. A., D. L., S. G.

సూర్యుడు పగలు మాత్రమే వెలుగును నింపితే, చంద్రుడు రాత్రిని వెలుగుతో నింపుతాడు. కాని కొందరు మహావ్యక్తులు, రాత్రనక, పగలనక శ్రమించి, ప్రజల కోసం పాటుపడి, వారికి వెలుగును ప్రసాదించి, తాము బలైపోతారు. అటువంటి వారిలో మన ద్వితీయ ప్రధాని స్వర్గీయ శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి ఒకరు. ఆదర్శాల పూలమాలలతో, ఆశయాల నీరాజనాలతో, కీర్తి ప్రతిష్టల నైవేద్యాలతో భరతమాతను సేవించి, తరించిన మన లాల్ బహదూర్ శాస్త్రి వర్థంతి నేడే:



క్రీ॥ శ॥ 1964 సం॥లో నెహ్రూ మరణానంతరం శ్రీ లాల్‌బహదూర్‌శాస్త్రి ప్రధాన మంత్రి పదవిని స్వీకరించినపుడు 'ఈ పొట్టి వాడు ఇంత పెద్ద దేశాన్ని పాలించగలడా' అని సందేహించినవారు ఎందరో వున్నారు. 'దేశం ఏమి కానున్నదో' నని ఆందోళన చెందినవారు కోకొల్లలు. ఇలాంటి తరుణంలో శ్రీ శాస్త్రి ప్రధానియై కేవలం 19 మాసాలు మన దేశాన్ని అత్యంత సమర్థతతో పాలించి, అనేకజటిల సమస్యలను సులువుగా పరిష్కరించి, స్వర్గీయ అమెరికా ప్రెసిడెంట్ కెన్నడీవలె, శ్రీ శాస్త్రి అతి తక్కువ కాలంలో మేటి నాయకుడై, అశేష భారత ప్రజల ప్రేమాభిమానాలనే గాకుండా, ప్రపంచ రాజ్యాలచేత గౌరవ నీరాజనాలను అందుకొని, నెహ్రూ తదనంతరం భారతదేశం ఏమై పోతుందోనని సందిగ్ధావస్థలో వున్న రాజ్యాలకు, భయాందోళనలుచెందిన వ్యక్తులకు, గేలిచేసిన ప్రబుద్ధులకు కనువిప్పు కల్గించాడు.

అయితే మేరు సమానుడైన నెహ్రూ అనుకోకుండా మరణించడంతో ఒక్కసారి సమస్యలన్నీ కారుమబ్బుల్లా చుట్టుముట్టాయి. క్రొత్తగా వచ్చిన లాల్ బహదూర్‌శాస్త్రి బలహీనుడని భ్రమించి, ఇదే మంచి సమయమని భావించి జాతీయ, అంతర్జాతీయ దుష్టశక్తులు ఒక్కుమ్మడిగా దాడి చేశాయి. ఆహార సమస్య ఉన్నట్లుండి ఒక్కసారి విషమించింది. జనాభా సమస్య ఎక్కువైంది. ధరలు ఆకాశాన్నంటాయి. ఆర్థిక సమస్య తీవ్రతరమైంది. దక్షిణాదిన హిందీ ఉద్యమం ప్రబలమైంది. వీటికితోడు కాశ్మీర్ సమస్యను పురస్కరించుకొని పాకిస్తాన్ మన దేశంపై యుద్ధాన్ని ప్రకటించింది. ఇలాంటి విషమ పరిస్థితులలో శాస్త్రి మనో నిబ్బరాన్ని కూడగట్టుకొని ముందుకు సాగాడు. శాంతికాముకుడు విశ్వరూపం దాల్చాడు. విదేశాల సహకారాన్నికోరాడు. దేశరక్షణ నిధికోసం దేశమంతటా పర్యటించి కొన్ని వేల తులాల బంగారాన్ని, వెండిని ప్రోగుచేశాడు. జై కిసాన్—జై జవాన్ అనే నినాదాన్ని చాటి, రైతులను, సైనికులను, తదితర ప్రజలను ఏకం చేసి, అసమాన ధైర్య సాహసాలతో, అద్వితీయ ప్రజ్ఞా ప్రావీణ్యాలతో, దుష్టశక్తులను నిర్జించి, జాతికి, ఆత్మ విశ్వాసాన్ని కల్గించి, ఆపదలోనూ, సంక్షోభంలోనూ చెక్కు చెదరని ధీశాలి శ్రీ లాల్ బహదూర్ శాస్త్రి అని కీర్తింప బడ్డాడు.

భారతజాతి చరిత్రలో సర్వజనావళి స్మరింపదగిన ఇటువంటి మహావ్యక్తి క్రీ॥శ॥ 1904 వ సంవత్సరంలో మహాత్మాగాంధి పుట్టిన రోజునె అక్టోబరు, 2న కాశీక దగ్గ

రలో వున్న 'మొగల్‌సరాయ్' అనే గ్రామంలో ఒక సామాన్య కుటుంబంలో జన్మించాడు. పుట్టిన ఒకటిన్నర సంవత్సరానికే తన తండ్రి శారదాప్రసాద్ మరణించాడు. నాటినుండి లాల్ బహదూర్ తాత 'హజరీలాల్' పెంపకంలో పెరిగి పెద్దవాడయ్యాడు. ఉన్నత పాఠశాలలో చదవటం కోసం వారణాసిలో తన మేనమామ రఘునాథ ప్రసాద్ అండన చేరవలసి వచ్చింది. ఈయన నీతి నిజాయితీలు, శీల సంపద లాల్ బహదూర్ భవిష్యత్తులో ఆదర్శ జీవితానికి బాటలు వేశాయి.

బాల్యంలో సైతం లాల్ బహదూర్ ఎన్నో సాహస కృత్యాలను గావించాడు. ఒకసారి ఆయన దగ్గర పడవలో వెళ్ళుటకు డబ్బులు లేక, ప్రవహిస్తున్న గంగానదిలో ఒక ఒడ్డునుంచి మరొక ఒడ్డుకు, బట్టలను, పుస్తకాలను, తలకు కట్టుకొని ఈదాడట. ఒకమారు అలహాబాద్ నగర ఒడ్డునవున్న టవర్ క్లాక్‌పై జాతీయ పతాకాన్ని ఎగురవేయాలని జాతీయ కాంగ్రెసువారు నిశ్చయించుకొన్నారట. ఈ విషయం పసిగట్టిన ప్రభుత్వం పోలీసు బందోబస్తును ఏర్పాటు చేసింది. అటువంటి సమయంలో ఆడవేషాన్ని ధరించి, మొఖానికి 'బురఖా' వేసుకొని టవర్‌క్లాక్‌పై జాతీయ పతాకాన్ని రెపరెపలాడించాడట. ఇలాంటి సంఘటనలు లాల్ బహదూర్ బాల్యంలో ఎన్నో జరిగాయి.

లాల్ బహదూర్ వారణాసిలో విద్యాభ్యాసాన్ని కొనసాగిస్తుండగా 1915వ సం||లో గాంధీజీ హిందూ విశ్వవిద్యాలయ భవనాలకు శంకుస్థాపన చేయడంకోసం వారణాసి సందర్శించడం జరిగింది. లాల్ బహదూర్‌కు అప్పటికి 11 సం||రాలు గాంధీజీని మొదటిసారిగా లాల్ చూశాడు. మహాత్ముని రూపం లాల్ బహదూర్ హృదయాన్ని ఎంతగానో ఆకర్షించింది. బాల్యంనుండి యవ్వనంలో ప్రవేశిస్తున్న లాల్ బహదూర్‌కు మహాత్ముని బోధనలు బాగా నచ్చాయి. జాతీయ భావాలు మనసులో నాటుకున్నాయి. నాటినుండి గాంధీ అన్న, ఆయన బోధనలన్నా ఎనలేని భక్తి గౌరవాలను ఏర్పరచుకొన్నాడు. అలాంటి తరుణంలో 1921లో దేశవ్యాప్తంగా సహాయ నిరాకరణోద్యమాన్ని ప్రారంభించిన సందర్భంలో మరొకసారి గాంధీజీ వారణాసికి రావటం తటస్థించింది. గాంధీ ఉపన్యాసాలను శ్రద్ధగా ఆలకించిన లాల్ బహదూర్ మహాత్ముని అడుగుజాడల్లో నడవాలని గట్టిగా నిశ్చయించుకొన్నాడు. నాటికి లాల్ బహదూర్ వయస్సు 16సం.రాలు గాంధీజీ ఇచ్చిన పిలుపు ననుసరించి, నాటి హిందూ విశ్వవిద్యాలయంలోని ప్రొఫెసర్లు ఆచార్య కృపాలానీ, ఇంకా కొందరు ప్రముఖులు తమ పదవులకు రాజీనామాలిచ్చి ఉద్యమంలో చేరారు. లాల్ బహదూర్ కూడా తన చదువుకు స్వస్తిచెప్పి, సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొని, అందరితోపాటు జైలుకెళ్ళాడు. అయితేపోలీసులు ఈయనను వెంటనే విడుదలచేయటం జరిగింది. ఆ తర్వాత గాంధీజీ ఆశీస్సులతో కాశీ విద్యాపీఠంలోచేరి, నాలుగు సంవత్సరాలు విద్యాభ్యాసంచేసి, మొదటి శ్రేణిలో ఉత్తీర్ణుడై, తన జీవితాన్ని, వ్యక్తిత్వాన్ని వికసింపజేసికొని సుప్రసిద్ధ గాంధేయవాదులు, అఖండ మేధావుల పర్యవేక్షణలో ఆలోచనాపరుడిగా, దేశ శ్రేయోభిలాషిగా రూపొంది 'శాస్త్రీ' అనే పట్టాను పుచ్చుకొని, లాల్‌బహదూర్‌శాస్త్రిగా పిలువబడి, భారతదేశ చరిత్రలో శాశ్వత స్థానాన్ని సంపాదించుకున్నాడు, పాపం! ఇక్కడకూడా ఈయనకు దారిద్ర్యం తప్పలేదు. తోటి విద్యార్థులు సైకిళ్ళపై వెళ్ళి వస్తుంటే, శాస్త్రి 16 మైళ్ళు రోజూ నడిచి వెళ్ళేవారు. ఈ



కళాశాల ప్రిన్సిపాల్ డా. భగవాన్‌దాస్ 'సమన్వయవాద' ప్రభావం లాల్ బహదూర్ శాస్త్రి జీవితంపై విశేషంగా కనిపిస్తుంది.

పట్టా పుచ్చుకొన్న తర్వాత 1925_26 సం॥రాల మధ్య శాస్త్రికి లాలాలజపతిరాయ్‌తో, జవహర్‌లాల్‌నెహ్రూ గారితో పరిచయం ఏర్పడింది. శాస్త్రి, లజపతిరాయ్ స్థాపించిన 'సర్వెంట్స్ ఆఫ్ ది పీపుల్స్ సొసైటీ'లో శాశ్వత సభ్యుడిగా చేరాడు. ఈ సొసైటీ సభ్యత్వం తన భావాలను దృక్పధాన్ని తీర్చిదిద్దినట్లు తానే స్వయంగా చెప్పుకున్నాడు.

ఈయన వివాహం లలితాదేవితో 1927 ప్రాంతంలో జరిగింది. వివాహ సమయంలో కట్నంగా ఆయన తీసుకున్నది ఒక చరఖా, కొన్ని గజాల ఖాదీ వస్త్రం.

అలహాబాదులో 'సర్వెంట్స్ ఆఫ్ ది పీపుల్స్ సొసైటీ' సభ్యుడిగా కృషిచేస్తున్న తరుణంలోనే శాస్త్రికి, మొదటిసారిగా జవహర్‌లాల్‌నెహ్రూతో పరిచయం ఏర్పడింది. వీరిద్దరి భావాలు ఏకమైనాయి. అయితే వీరి ఆవేశాలకు ఉత్సాహాలకు గాంధీజీ హితబోధనలు అడ్డుగోడను ఏర్పరిచాయి. తర్వాత శాస్త్రి మునిసిపాలిటీ రాజకీయాల్లో ప్రవేశించాడు. అలహాబాద్ మునిసిపల్ బోర్డు సభ్యుడిగా 7 సంవత్సరాలు పనిచేసాడు. అలహాబాద్ మురికివాడల్లో పూరి గుడిశెల్లో నివసించే హరిజనుల సేవకు ఎంతో కృషి చేశాడు. ఈయన నిష్కల్మష సేవా ప్రవృత్తి హరిజనులను ఎంతో ముగ్ధుల్ని చేసింది. శాస్త్రి ఆనాడు జరిగిన ప్రతి కాంగ్రెసు మహాసభలో పాల్గొని, కార్యవాదిగా, మితభాషిగా. నిగర్విగా అందరిచేత ప్రశంసింపబడ్డాడు. అలహాబాద్ జిల్లా కాంగ్రెసుసంఘ అధ్యక్షుడుగానూ, కార్యదర్శిగానూ, ఆయన పార్టీసేవ, ప్రజాసేవ అనిర్వచనీయం. 1935 సంవత్సరంలో కాంగ్రెసు సంస్థ కార్యవర్గానికి ఉత్తరప్రదేశ్‌లో. జరిగిన ఎన్నికలకు నాయకత్వం వహించి రాష్ట్ర కార్యదర్శిగా ఎన్నుకోబడి, 1938 వ సంవత్సరము వరకు ఆ పదవిలో వున్నాడు. అప్పటికి శాస్త్రికి 31 సంవత్సరములు. అంతటి చిన్న వయసులో రాష్ట్ర కార్య

జీ వి త ం

భవిష్యత్తంతా
తీరని మధుర స్వప్నాల మయం
గత మంతా
మరచి పోలేని విషాదం
ప్రస్తుత మంత్రం
భరించ లేని దుర్భర దారిద్ర్యం.

—మాధవుడు

దర్శిగా ఎంతోఓర్పును చాకచక్యాన్ని ప్రదర్శించి, బ్రిటీష్, అవరోధాలను ఎదుర్కొని, కాంగ్రెసు నాయకులచేత శ్లాఘించబడ్డాడు. తర్వాత 1937 సంవత్సరములో శాస్త్రి యు. పి అసెంబ్లీకి ఎన్నికైనారు. 1945లో స్టేట్‌కాంగ్రెస్ పార్లమెంటరీ బోర్డు కార్యదర్శిగా పనిచేశాడు. 1946లో తిరిగి ఎన్నికై, నాటి ముఖ్యమంత్రి గోవింద వల్లభపంత్‌కు పార్లమెంటరీ సెక్రటరీగా నియమితుడైనాడు. ఆ మరుసటి సంవత్సరమే రవాణా_పోలీసుశాఖల మంత్రి పదవిని అలంకరించారు. ఈ తరుణంలో బ్రిటీషువారు భారతదేశానికి స్వతంత్ర్యాన్నిస్తూ, పాకిస్తాన్_హిందూస్తాన్ అనే రెండు భాగాలుగా విభజించాడు. దీనితో హిందూ-ముస్లిం తగాదాలు పెచ్చు పెరిగి, తీవ్రరూపం దాల్చి, దోపిడీలు మానభంగాలు, హత్యలు, జరుగుతున్న సమయంలో శాస్త్రి ఇరువర్గాల వారితో సమర భావంతో సంప్రదింపులు జరిపి, అతి చాకచక్యంతో శాంతి భద్రతలను యధాస్థితికితెచ్చి, చేతలేగాని మాట లెరుగని కార్యకర్త అనిపించుకొన్నాడు.

అలహాబాద్‌లో నెహ్రూ, శాస్త్రీల మధ్య ఏర్పడిన పరిచయం క్రమంగా స్నేహంగా మారింది. మనకు స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత నెహ్రూ మంత్రివర్గంలో శాస్త్రి భారత రైల్వే మంత్రిగా నియమింపబడ్డాడు. అయితే 1956లో 'అరియలూరు' వద్ద జరిగిన రైలుప్రమాదం తన పదవీ నిర్వహణాకాలంలో జరగటం తన అసమర్ధతకే తార్కాణమని; ఎందరు చెప్పినా వినకుండా తన పదవికి రాజీనామా చేసి, పదవీ కాంక్షా వహితుడుగా పేర్కొన

బడ్డాడు. తర్వాత మరల 1957 సంవత్సరంలో పార్లమెంటు మెంబరుగా ఎన్నికై, నెహ్రూ మంత్రిమండలిలో తిరిగి 'కమ్యూనికేషన్స్–ట్రాన్స్‌పోర్టు' మంత్రిగా నియమింపబడి తర్వాత వాణిజ్య పరిశ్రమల మంత్రిగా మార్చబడ్డాడు. 1964 సంవత్సరములో గోవింద వల్లభపంత్ మరణంతో హోమ్‌శాఖను కూడా ఈయనకే అప్పజెప్పటం జరిగింది. అవినీతి నిర్మూలనకోసం శాస్త్రి ఈరోజుల్లోనే తన కృషిని ప్రారంభించాడు. 'సంతానం కమిటి' ని నియమించింది ఈయన హయాంలోనే.

అయితే 1963, మే నెలలో జరిగిన పార్లమెంటరీ ఉప ఎన్నికలలో కాంగ్రెస్ ఓడిపోయింది. దీంతో కామరాజ్ పథకం ప్రకారం, కొందరు మంత్రులతోపాటు, శాస్త్రికూడా రాజీనామా చేయటం జరిగింది. అయితే నెహ్రూ ఆకస్మికంగా అస్వస్థులైనందున, శాస్త్రి తిరిగి మంత్రిగా నియమితుడైనాడు. వెంటనే నెహ్రూ అతి ముఖ్యమైన పనులలో ఒకటైన మహమ్మద్ పవిత్ర కేశ అపహరణ వ్యవహారాన్ని శాస్త్రికి అప్పగించాడు. భయంకరమైన మత కల్లోలాలు రానున్న సమయంలో శాస్త్రి శ్రీనగర్ వెళ్ళి, అక్కడ సుహృద్భావ వాతావరణాన్ని నెలకొల్పాడు.

1964 సంవత్సరంలో విశ్వ మానవ సౌభ్రాతృత్వానికై అహర్నిశలు శ్రమించిన శాంతి కాముకుడు, భారతమాత గారాల బిడ్డ, మన ప్రియతమ అధినేత, భావితరాలవారికి సంస్మరణ జ్యోతిధి శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ ఆకస్మికంగా మరణించటంతో నూతనప్రధాని ఎవరన్న మీమాంస ఏర్పడింది. వివిధ వర్గాలవారు 'లాల్ బహదూర్‌శాస్త్రి' పేరును సూచించారు. ప్రధాని పదవికి పోటీ చేయదలచుకొన్న మొరార్జిదేశాయ్ సైతం తన అభిప్రాయాన్ని మార్చుకొని, తానే మొదటగా లాల్ బహదూర్ పేరును ప్రతిపాదించాడు.

ప్రధానమంత్రి హోదాలో 1964సంవత్సరం డిశంబర్‌లో బ్రిటన్‌ను సందర్శించారు. అనేక సమస్యలపై బ్రిటన్ పత్రికా విలేఖరులు కురిపించిన ప్రశ్నల వర్షానికి శాస్త్రి తడుముకోకుండా ఎంతో మనోనిబ్బరంతో ఇచ్చిన సమాధానాలు బ్రిటిష్ ప్రజల ప్రశంసలందుకున్నాయి. అలీన దేశాలు అణ్వస్త్రాలు తయారు చెయ్యకుండ, అణ్వస్త్ర దాడులనుండి రక్షణ పొందేటట్లు శాస్త్రి కొన్ని ప్రతిపాదనలను చేశారు. 'కైరో' లో అలీన దేశాల సభ జరిగినపుడు లాల్ బహదూర్ ఆసియా, ఆఫ్రికాదేశాల ప్రేమాభిమానాలను చూరగొన్నాడు.

1965వ సంవత్సరంలో ఈయన ప్రధానమంత్రిగా సూట్, హ్యాట్, బూట్ లేకుండా, ఏ విధమైన ఉన్ని దుస్తులు ధరింపకుండ సామాన్య దుస్తులలో ఎటువంటి ఆడంబరం, ఆర్భాటం లేకుండ చిన్న కాలిజోళ్ళతో చిరునవ్వు ఒలికిస్తూ, తొలిసారిగా మాస్కోలో అడుగుపెట్టినపుడు ఈయనకు అఖండ స్వాగతం లభించింది. కెనడా, లండన్, యుగోస్లేవియా, రంగూన్ మొదలగు దేశాలలో పర్యటించి ఆయా దేశాల జీవన ప్రమాణలను అర్థం చేసుకొని, వాటిని మన దేశంలో ప్రవేశపెట్టి, భారత జాతి గౌరవాన్ని పెంచాలని ప్రయత్నించిన శ్రీ శాస్త్రి నిజంగా ధన్యజీవి కాక మరేమిటి?

ఈ విధంగా వివిధ దేశాలతో సద్భావాన్ని పెంపొందించుకుంటున్న తరుణంలో, ఆహార కొరతను, ఆర్థిక మాంద్యాన్ని నిర్మూలించాలని ప్రయత్నాలు జరుగుతున్న సమయంలో మన పొరుగు దేశమైన, మన గడ్డలోనుంచి ఒక గడ్డగా విడిపోయిన పాకిస్తాన్ మన దేశంపై దండెత్తింది. కాశ్మీర్ కల్లోలాలను రేకెత్తించింది. కచ్ బార్డర్‌లో చొరబడింది. పాకిస్తాన్ సాయుధ దురాక్రమణను త్రిప్పి కొట్టడంలో లాల్ బహదూర్ చూపిన ప్రతిభ, చొరవ, గుండె నిబ్బరం, ధైర్య సాహసాలు



ప్రపంచ నాయకులను దిగ్భ్రాంతిలో ముంచెత్తాయి. భారతీయులు అసమర్థులని, పిరికివారని, శాంత స్వభావులని, మెత్తనివారని, పౌరుషహీనులని, బయటనుంచి ప్రమాదం వస్తే భారతదేశం అంతఃకలహాలతో విచ్ఛిన్నమై పోతుందని కొని: వర్గాలలో ప్రబలిన దురభిప్రాయాన్ని పటాపంచలు చేశాడు. భారతదేశ శక్తిని, శౌర్య పరాక్రమాలను చాటి ప్రపంచ దేశాలలో భారతదేశం తలెత్తుకునేట్లు చేశాడు.

వాస్తవిక దృష్టి, వివేకంగల శ్రీ శాస్త్రి భారత పాకిస్తాన్‌ల మధ్య యుద్ధ వాతావరణం ప్రబలటం ఏమాత్రం వాంఛనీయంకాదని, రష్యా ప్రధాని సలహా ప్రకారం, యుద్ధ విరమణ సంప్రదింపులకు తాష్కెంటుకు బయలుదేరి, పరస్పర స్నేహానికి ఒడంబడికలు కుదుర్చుకొని, తిరిగి భారతదేశానికి రావాలనుకొనే సమయంలో అకస్మాత్తుగా 1966 జనవరి 11వ తేదీ అర్ధరాత్రి కన్నుమూశాడు. ఆయన మరణం భారత ప్రజలను కలవరపరచింది. 'మన సారధి, మన సచివుడు, మన వియ్యము, మన సఖుండు, మన బాంధవుడు, మన విభుడు, గురుడు మనలను దిగవిడిచనియె' అని శోకించనివారు లేరు. శాస్త్రిగారి మరణంతో భారతదేశం మరొక నాయకుణ్ణి కోల్పోయింది. ఆయన గతించినా శాస్త్రిగారి ప్రభావం భారత ప్రజలపై చెక్కు చెదరలేదు. ఆయన స్ఫూర్తి, ప్రజానురాగం, సేవానురక్తి, యోచనాశక్తి, నిశ్చలత, భారతదేశానికి ఆదర్శప్రాయాలైనాయి. ఏమైనా శ్రీ శాస్త్రి ధన్యజీవి. ధైర్యశాలి, త్యాగశీలి, సౌజన్యమూర్తి, నిరాడంబగుడు, నిస్వార్థపరుడు. అట్టి అమరజీవికి మన శ్రద్ధాంజలులు.

## కలియుగ రాజకీయాలు

రావి రంగారావు

# గోముఖవ్యాఘ్రాలూ-గుంటనక్కలూ

ఒక అడవిలో ఎన్నో ఏళ్ళనుంచి గోముఖవ్యాఘ్రం గారు రాజ్యం చేస్తూవున్నారు. ప్రజాస్వామ్యం పేరుతో తాను గోవునని చెప్పుకుంటూ చాలా సార్లు ఎన్నికలలో గెలుస్తూవున్నారు. కొంత కాలానికి ఆ నిజస్వరూపం. ప్రాణులందరికీ తెలిసిపోయింది. మళ్ళీఎన్నికలొస్తున్నాయి ఎలాగెలిచి తీరాలాఅని రాజుగారు తీవ్రంగా ఆలోచించ సాగారు.

పులులు, సింహాలు, తోడేళ్ళు, గుంటనక్కలు పాములు తమకే ఓట్లు వేస్తాయని రాజుగారికి తెలుసు. కానీ వాటి సంఖ్య మొత్తంమీద చూస్తేచాలా తక్కువ. బలహీనవర్గాలైన కుందేళ్ళు, లేళ్ళు, ముంగిసలు, నెమళ్ళు, రకరకాల పక్షులు మొదలైనవి ఎక్కువ. అవి తనకు ఓట్లు వేయవు. ఆ ఓట్లు తన శత్రువుకు పడితే శత్రువుకు విజయం? తనకుఓటమి.

అందుకని గుంటనక్కల్ని అర్ధరాత్రి పిలిచి రహస్యంగా ఒక ప్రణాళిక ఇచ్చి బలహీనవర్గాల నాయకుల దగ్గరకు పంపించారు రాజుగారు. గుంటనక్కలు విడివిడిగా నాయకుల్ని కలసి ఇలా చెప్పటం మొదలుపెట్టాయి

"ఇంతకాల మేలుతున్న"
మన ఏలిక గోవుకాదు
గోవస్త్రాలను తాల్చిన
కుటిలమైన బెబ్బులి అది"

"అధికారంలోకి మీరు
రాకుండా అడ్డుతోంది
మీకు తెలియకుండానే
మీ జాతిని తింటున్నది"

"పులితో పోటీగ మీరు
ఎన్నికలో నిలబడాలి
బలహీనులు మీవైపే,
మీరు రాజు కావాలి"

కుందేళ్ళ నాయకుడికి, లేళ్ళనాయకుడికి, ముంగిసల నాయకుడికి, నెమళ్ళనాయకుడికి, రకరకాల పక్షుల నాయకులకు ఎవరికి వారికి మీరే కాబోయే రాజులంటూ ఉబ్బగొట్టి ఎన్నికలలో గోముఖ వ్యాఘ్రంగారికి పోటీగా నిలబెట్టాయి. అందులో కొందరునాయకులు గుంటనక్కల పాత్ర గ్రహించేసరికి రాజుగారు ఆనాయకుల్ని పిలిచి కొంత ఆహారం పడేసరికి వాళ్ళు నోరు మూసేసుకొని బయటికొచ్చి ఏమీ తెలియనట్లుగానే రాజుగారి మీదపోటీగా మిగతా నాయకులలాగే ఎన్నికలలో నిలబడ్డారు.

దోపిడీ మృగాలన్నీ
సంఖ్య తక్కువైతేనేం?
కలిసి ఓటు వేయగనే
గోముఖవ్యాఘ్రం గెలిచెను

బలహీనుల తెగలవారు
సంఖ్య ఎక్కువైతేనేం?
తెగలు చూసుకొన్నారు
ఓట్లు చీలిపోయాయి

గోముఖ వ్యాఘ్రం గుంపుకు
లాభం పదవుల రక్షలు
గుంటనక్కలకు చేతికి
చిక్కె కొన్ని లక్షలు

బలహీనుల నాయకులకు
దొరికెను ఎంగిలి మెతుకులు
బలహీనులు బలిపశువులు
దినదిన గండం బ్రతుకులు

# విద్యా పరమారము

ప్రాచీన కాలంనుండి గురుకుల ముఖంగా ఉత్తమ గురువులచే గరపబడిన అక్షరవిద్య స్థానే అర్థ విద్య సమాజాన్ని ఎంతవరకు అభివృద్ధి పథంలో నడిపించిందనేది మన ముందున్న పెద్ద ప్రశ్న. గురువులు ఉత్తమ సంస్కారాన్ని ఇచ్చి ఉన్నత మానవులుగా మనుష్యులను తీర్చిదిద్ది అజ్ఞానాన్ని పారద్రోలి, జ్ఞాన భిక్షను ప్రసాదించే పరమ పురుషులు. ఉత్తమ గ్రంథాలు హృదయాన్ని పోషించి పెంచి చీకటి తెరలలో జ్ఞాన జ్యోతులు వెలిగించే సాధనాలు. విద్య అనే రెండక్షరాల దివ్య ఔషధం మానవాళి మనుగడకు వరప్రసాదితం. ప్రాచీనుల కాలం నుండి నేటి ఆధునిక కాలం వరకు మానవ నాగరికతకు విద్యమాధ్యయం అయింది. విద్య నిస్సంశయంగా సర్వజన సమాహారం.

నాటి గురుకులాల తరం అంతమై నేటి పాఠశాలలు, కళాశాలలు విద్యా బోధనకు సముచితమైన సోపానాన్ని ఏర్పరుస్తున్నాయా? అనేది మరొక ప్రశ్న. విద్యను శక్తిగా ఆరాధించి మానవుడు ప్రకృతిని జయించడానికి ఉద్యమించిన రోజులివి. అయితే ఈ ఉద్యమంలో వినాశకరశక్తులు ఉద్భవమౌతున్నాయి. దానికి కారణం ప్రప్రథమంగా విద్యా విధానంలో శీలాన్ని పెంపొందించే అంశాలు కరువు అవడమే. "శీలేన శోభతే విద్య" అనే సూత్రం విద్యార్థులకు, అధ్యాపకులకు మార్గదర్శకమై సదా ఆచరణీయం ఐననాడు మన విద్యకు నిజమయిన శక్తి మనం కల్పించినవారం అవుతాము. విద్యా ప్రణాళిక రచయితలు ఈ అంశాన్ని దృష్టిలో ఉంచుకొనక పోవడం దురదృష్టం. ఇకనైనా ఈ లోపం తొలగిపోతుందని ఆశిద్దాం!

అధ్యాపకుల పాత్ర విద్య అభివృద్ధిలో గణనీయంగా ఉన్నది. అధ్యాపకులు నిరంతర విజ్ఞాన సముపార్జన తమ ఏకైక లక్ష్యంగా పెట్టుకొని, తమ వృత్తిలో అత్యంత సంతృప్తిచెందుతూ, తమ ద్వారా ఉత్తమ సమాజ నిర్మాణం, అభివృద్ధి సక్రమంగా జరగాలనే తలంపుతో ఉద్యమించి అర్థలాభపు లబ్ధికొరకు నిరంతర తపన వదలివేసిననాడు విద్య సరియైన పద్ధతిలో బోధించబడటానికి ఆస్కారం కలుగుతుంది. అలాంటి అధ్యాపకులు మాన్యులై "గురుర్బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః" అనే ఆర్యోక్తికి ఉద్ధరులౌతారు. అలాంటి గురువులలో ఎన్నదగినవారు సర్వేపల్లి రాధాకృష్ణ, సి. వి. రామన్, జగదీశచంద్రబోస్, గోపాలకృష్ణగోఖలే మొదలగువారు.

## విద్యావిపంచి

డా॥ పి.జి. కృష్ణమూర్తి

విద్యారంగంలో బ్రిటిష్ పాలనా కాలంనుండి వస్తున్న 'లౌకిక విధానం' కేవలం ఆర్థికంగా సమాజం అభివృద్ధి చెందడానికి ఉపయోగపడుతుందే. కాని మానవతా విలువలు పెరగటానికి దానిలో జరుగుతున్న కృషి శూన్యం. శాస్త్ర విజ్ఞానం, ఆధ్యాత్మిక అవగాహన లోపంతో మానవాళి మనుగడకే ముప్పు తెచ్చేదిగా తయారైంది. విద్య 'వాడుకానేది' గా కాక 'కూడుకానేది'గా అభివృద్ధి చెందాలి.

నేటి మన ప్రధాని తలపెట్టిన కొత్త విద్యా విధానంలో డిగ్రీలు ఉద్యోగాలు వేరుచేయబడిననాడు విద్య, క్రియా శీలకమై తుష్టిని, పుష్టిని పెంచుకొని శీల నిర్మాణమార్గంలో గుణాత్మకంగా వర్ధిల్లిననాడు మనందరికీ పరిపూర్ణ ఆనందం లభ్యమౌతుందని ఆశించవచ్చు. దానికితోడు విద్యను మూడు భాగాలుగా విభజించి సాంకేతిక, శాస్త్ర, వైద్య, సాధారణ విద్యలుగా ఉన్నతస్థాయిలో ఆధునిక శాస్త్ర పద్ధతులలో బోధించడం అవసరం. వృత్తి విద్యలు ప్రవేశ పెట్టబడి కళాశాలస్థాయి దాటగానే విద్యార్థులు స్వవృత్తులు చేసుకొనుటకు వీలుగా మన విద్యాప్రణాళిక రచించబడాలి. నేటి జాతీయ అంతర్జాతీయ వికాస దృష్ట్యా కళాశాలస్థాయి వరకైనా విద్య మన బాల బాలికలకు అందరికీ విధిగా బోధించబడాలి.

మన విద్యా ప్రణాళిక మన దేశ జాతీయతను ప్రతి బింబించేదిగా రూపు దిద్దుకొనాలి. దేశ సాంఘిక, ఐతి హాసిక, సాంస్కృతిక, రాజనైతిక విషయాల అధ్యయ నాన్ని కళాశాలస్థాయి వరకయినా విద్యార్థులందరకీ తప్పనిసరిగా బోధించే అవకాశం కల్పించాలి. ఏ విద్య భాషల అధ్యయనానికి దూరమై కేవలం విషయ సేకరణకు పరిమితమైపోతుందో ఆ విద్యలో కళాత్మకత కరువై పోతుంది. అప్పుడే ఆ విద్యలో జీవం, హృదయం నశిసాయి.

నేటి మన విద్యాలయాలు కలుషిత వాతావరణంలో అనేక కడగండ్ల పాలైనాయి. ఒక వైపున విద్యాసంస్థల నిర్వాహకులు విద్యను వ్యాపారంగా మార్చుకొని, సీట్లను అమ్ముకొని కోట్లు గడిస్తుంటే మరొక వైపున విద్యార్థులు ఆందోళన, అలజడి తమ ఊపిరని భావించి, సమ్మెలనే ఆయుధాలను కానిదానికీ, అయినదానికీ ప్రయోగించి విద్యా లయాల్ని కలుషితం చేస్తున్నారు. దీనికి తోడు అశ్లీల సాహిత్యం, నిష్ప్రయోజన, నిర్వ్యాపారత్వం ప్రబలిపోయి సినిమాల దుష్ప్రభావంలో కొట్టుకుపోతున్నది మన విద్యార్థిలోకం. అటు తలిదండ్రులకు ఇటు అధ్యాపకులకు వశం కాకుండా నిరంకుశ ధోరణిలో పయనిస్తున్న ఈతరం విద్యార్థులు ఎలాంటి అభివృద్ధిని సాధింపగల్గుతారనేది సమాజానికి ఎంతవరకు ఉపయోగపడతారనేది ఇంకొక ప్రశ్న.

మన విద్య "అనుసరణ సంస్కృతి ప్రభావాన్ని" విడనాడి భారతీయ సంస్కృతిని జీర్ణించుకొని పురోగ మించాలంటే అది ఎలాంటిది? ఎవరికి? ఎంతవరకు? అనే విషయాలు సాకల్యంగా ఆలోచించి సరియైన విద్యా ప్రణా ళికల ద్వారా, అత్యుత్తమ అధ్యాపకులను ఎంపికచేసి విద్యా వ్యవసాయ నిర్వహణ కొనసాగించాలి. అప్పుడే మంచి విద్యా పుష్పములు, పూర్ణ విద్యా ఫలములు జాతి అందుకొనగలదు. అదే విద్య పరమార్థము!



# వైద్యం చుట్టూ...

'డాక్టర్నవుదామనుకొన్నాను. యాక్టర్నయ్యాను''— అంటుంది ఏ చోటా పదహారేళ్ళ పుట్టిన్రోజు పండగ జరుపుకునే సినీతారాకుమారి.— మా అబ్బాయి బై.పి.సి. తీసికున్నాడని చెప్పడం డాక్టరవుతాడని చెప్పడంలోని ఎడ్వాన్సుడు మురిసిపాటు— అబ్బాయి బై.పి.సిపాట్లు, జూఆలజీ డిసెక్షన్లో ఆపరేషన్ అనుభూతులు అన్నీ మెడికల్ ఎంట్రన్స్‌లో గల్లంతు. ఇవ్వన్నీ డాక్టర్ వృత్తిలో పూర్వరంగ హాస్య విశేషాలు! కాగా వైద్యరంగాన్ని అల్లుకొని బోలెడు హాస్యంఉంది.

ఆ మాటకొస్తే మనమందరం వైద్యులమే! వైద్యం తెలీనివాడు వానలో తడవనివాడు లేడు. "నీచేతి మాత్ర వైకుంఠయాత్ర అని వైద్యం తెలీనివాడి వ్యవహారం పరిణమించే విధానం మనం చెప్పుకుంటూనే వైద్యసలహాలు ఉచితంగానే, అయాచితంగానే సెలవిచ్చేస్తాం! కావాలంటే'' జలుబుగా ఉంది మాస్టారూ!—అని మీకొలీగ్‌తో ఓసారిఅని చూడండి. "కాడోఫైరన్'' వాడిచూడండంటాడు. ఆమాట రెండో ఆయన విన్నాడో 'కోల్డారిన్' వాడండి బాగాపని చేస్తుందంటాడు. మిరియాలపాలు తాగమని ఒకళ్ళు. కారప్పొడి వెల్లుల్లి మరొకళ్ళు, ఆమ్లెట్ తినమనో, ఏమందూ వద్దు "ఏమందో'' క్లొట్టెయ్యమనో శరపరంపరలుగా వైద్యసలహాలొచ్చి పడతాయ్! జలుబుగురించి ఓ సామెత చెబుతారు. మందువాడితే ఒక వారం రోజుల్లో మందువాడక పోతే ఏడురోజుల్లో తగ్గిపోతుందని— అది గ్రహించని మనం తుమ్మితే ఊడని ముక్కును పదేపదే నిలిపి ఊడగొట్టటానికి ప్రయత్నిస్తాం! పదిశం పదిరోగాల పెట్టుగదా! అని వారంరోజులూ పదిరకాల మందులు మింగేసాం!

మన సామెతలు కొన్ని వైద్య విషయాలు మీకునవ్వు రావచ్చు. "మందుకు పథ్యం మాటకు సత్యం"—"ఉల్లి చేసినమేలు తల్లైనాచేయదు—శొంఠి శోధిస్తుంది" ఇలాంటివి వైద్య విజ్ఞానాన్ని అందిస్తున్నాయి. జ్వరజిహ్వకు పంచదార చేదట. దగ్గుసిగ్గుదాచినా దాగవు. తీటగలవాడికి, తోటగలవాడికి తీరిక ఉండదట.

"జరుగుబాటుంటే చలిజ్వరమంతసుఖంలేదంటే అదంత సుఖరోగమా? అని ఓ రసికోత్తముని ఎదురుప్రశ్న". ఇక్కడ అంతాక్షేమం మీక్షేమసమాచారాలు తెలుపగలరు''— అని మనం రాసుకునే కార్డుమీద "జ్వరమా! అదిమలేరియా కావచ్చు" అనిచూడగానే నా మట్టుకు నాకు వణుకొస్తుంది.




ఇదివరలో మలేరియా డిపార్టుమెంటువాళ్ళు ఇంటింటికీ తిరిగేటప్పుడు మీ ఇంట్లో ఎవరికైనా జ్వరమా? దానితో పాటు చలిగా ఉందా? అంటూ ప్రశ్నలవర్షం కురిపించేవారు మలేరియాను కనిపెట్టడానికి. తెల్లవారీవారకుండానే ఈప్రశ్నలేమిటని అపశకునాల్లా అని చిరాకు పడేవాళ్ళు కొందరు. ఇదంతా ఎందుకని డిపార్టుమెంటువాళ్ళు లేటెస్టుటెక్నిక్‌గా భాషమార్చి "మీయింట్లో అంతా కులాసాయేగదండీ! అని అనడం మొదలెట్టారు. ఓసారి యిద్దరు మాట్లాడుకొంటున్నారు. ఓకాయన అంటున్నాడు" మీకేమండీ! మీదికులాసా డిపార్టుమెంటు అని. ఏదబ్బా అంత గొప్ప కులాసాడిపార్టుమెంటు భారతదేశంలో అనుకొంటూండ

గానే వీరిది మలేరియా డిపార్టుమెంటని పరిచయం జరిగిపోయింది.

ప్రవృత్తిరీత్యా చూస్తే డాక్టర్లరాత(దస్తూరి)బ్రహ్మరాత. అది ఓపట్టాన మనకి అర్థంకాదు. ఓసారి క్యాంపుకెళ్ళిన డాక్టరుగారి ఉత్తరం వారి శ్రీమతికి చేరింది. "నాన్నగారేం రాశారో అర్థమై చావడంలేదు. ఓరేయ్ బాబిగా మెడికల్ షాపుకెళ్ళి ఏం రాశారో చదివించుకు రారా! అందిట ఆ శ్రీమతి విసుగ్గా—ఇది డాక్టర్లరాతలు మెడికల్‌షాపు వాళ్ళకే అర్థం అవుతాయని చెప్పడానికి చెప్పినజోకు—

అప్పులిచ్చేవాడు, వైద్యుడు, నిత్యం పారేనది, బ్రాహ్మణుడు. ఉన్నఊళ్ళోనే ఉండు లేని ఊరుకు వెళ్ళద్దని పాపం! "అప్పిచ్చువాడు" అనే పద్యంలో సుమతీశతకకారుడు చెబితే "అప్పిచ్చువాడు వైద్యుడని" రాముని తోకలా చదివి వైద్యుణ్ణి అప్పిచ్చువాడు చేసారు. మరో సందర్భంలో మరో హాస్య కారుడు "అప్పిచ్చువాడు వైద్యుడని" (అ+పిచ్చివాడు) పిచ్చివాణ్ణి గూడా చేశాడు.

సినిమాల్లో డాక్టర్లు తెల్లటిదుస్తులు, అందమైనగెటప్‌లో చూడముచ్చటగా ఉంటారు. చావుబతుకుల్లోవున్న పేషెంట్ చెప్పే పేరాల పేరాల డైలాగులు పేషెంట్‌గా వింటారు. తాను వైద్యుణ్ణనే విషయం మర్చిపోయి కొండొకచో వేదాంత విషయాలు, సామెతలు సూక్తులు వల్లిస్తారు. "వ్యాధికి మందుగాని విధికి మందా? అన్నా మనం ఆశ్చర్య పడక్కర్లేదు. నవ్వుకోవాలి!

ఏ డాక్టరుగారెంత నవ్వించినా డాక్టరుగారికి దూరంగా ఉండటమే ఆరోగ్యం."AN APPLE A DAY KEEPS THE DOCTOR AWAY'



# మీసాయణం

కె.బి.కృష్ణ

ఆరు అడుగుల ఎత్తు, ఎత్తుకు తగిన లావు. విశాలమైన ఛాతీ కొనదేరిన ముక్కు ఇట్టే ఆకర్షించు క్రొలరూపం. ఏయువతి చూసినా ఇతని గుండెల్లో నిదురపోని(బతుకెందుకు అనుకోకమానదేమో అనిపిస్తుంది. అతనేమా అర్జునరావు. మా ఆఫీసులో ఉద్యోగి.

అయితే అతనిలో ఒకేఒక్క లోపం గోచరించింది మాకు.

అతనికి మీసాలు లేవు. ఎప్పుడూ నున్నగా గీసేసి మీసాల గ్రౌండ్ నున్నగా వుంచుతాడు.

అతను గుబురు మీసాలు పెంచితే ఎంత బాగుంటుందని మాతోపాటుగా తోటి స్త్రీ ఉద్యోగులుకూడా అనుకోవడం



మేము వినడం జరిగింది. ఈ మా కోరిక అతనికి తెలియ చేస్తే ఎలా వుంటుంది? ఒకవేళ అతనేమైనా ఫీలవుతాడా? అనేది సమస్య అయింది. చివరకు అర్జునరావుకు నేనే చెప్తానన్నాను.

మేము అందరం లంచవర్‌లో కూర్చుని వుండగా, అర్జునరావు మాతో సరదాగా కబుర్లు చెప్తున్న సమయంలో

"అర్జునరావుగారూ మాదో చిన్న మనవి" అన్నాను.

"మనవి అంటున్నారు ఏమిటి విశేషం. వాట్ కెనయి డూ ఫర్ యూ" అన్నాడు నవ్వుతూ.

అతను నవ్వుతున్నప్పుడు, ఆ పెదాలపైన గుబురు మీసాలు వుంటే ఎంత బాగుండేది అనిపించింది. మాకు అందరికీ త్వరలో ఆ సుందర దృశ్యం చూడాలని ఆరాటంగా వుంది.

"మీరు మీసాలు ఎందుకు పెంచారు ?" అన్నాను. అనుకోకుండా వచ్చిన ఆ ప్రశ్నకు అతను కొంచెం ఆశ్చర్యపోయి.

"ఎందుకండీ మీసాలు పెంచడం? వాటిని పెంచడం వలన చాలా అనర్థాలు వున్నాయి."

"ఏమిటో"

"ఆ ఏముందీ, పెంచేక అవి ఏ ఫ్యాషన్‌లో పెంచాలని ఒక గొడవ. షేవింగ్ చేసుకునేటప్పుడు చాలా జాగ్రత్తగా చేసుకోకపోతే అటు ఎక్కువయిందని ఇటు ఎక్కువయిందని అటు, ఒక్కోసారి రెండువైపులా గొరిగెయ్యడం జరుగుతుంది. బోడిముఖంతో ఆఫీసుకు వెళితే "ఏం గురూగారూ రాత్రి నాటకం వేశారా ?" అని అందరూ అడగడం. ఇలా ఎన్నో గొడవలులెండి. ఎందుకొచ్చిన గొడవ అన్నాడు.

అతను చెప్పిన కారణాలు సబబుగా వున్నాసరే మా ప్రయత్నం విరమించుకోదలచుకోలేదు.

"మీరు మీసాలు పెంచండి. వాటి పోషణభారం, వాటి స్టయిలు వగైరాలు మేముచూసుకుంటాం వుయ్ మీన్ మీకు ఏం స్టయిలు బాగుంటుందో సెలక్టు చేద్దాం. మీరు మీసాలు పెంచుకుంటే ఎంతో బాగుంటారు"అని ఆయనపై వొత్తిడి తెచ్చాం ఆయన మీసాల అంటే షేవింగ్ మాత్రం గాదుసుమా.

ఎలాగో ఆయన ఫూల్డ్ అయినట్లే అనిపించింది "సర్లెండి చూద్దాం అన్నాడాయన. బుంగమీసాలతో

అర్జునరావు ముఖారవిందాల్ని వెలవెల ఊహించుకో సాగేము.

మా ఆశలకు అనుగుణంగా—

మా సూచనమేరకు—

మర్నాడు ఆయన షేవింగుమాత్రం చేసుకుని, మీసాల గ్రౌండ్‌ని ఫ్రీగా వదిలేసి వచ్చాడు. ఆయన ముక్కుక్రింద నల్లని చారలు ఎంతో అందంగా వున్నాయి. ఆయనకు దట్టంగా మీసాలు వస్తే ఇంకా ఎంత బాగుంటుందో.

యూరియా, బాగా మాగిన పశువుల పెంట వేసి, తరచు కలుపు మొక్కలు పెకిలివేస్తున్న పైరులా, అర్జునరావు మీసాలు దట్టంగా పెరిగిపోయాయి.

అప్పటివరకు, వాటికి పైకిరావడానికి అవకాశంఇవ్వక అస్వతంత్రంగా అణచివేయబడటంవలన, ఒక్కసారిగా అవి, అనగా అర్జునరావు మీసాలు విజృంభించి అడవి పందివంటి పై వెంట్రుకల్లా ఆయన మీసాల గ్రౌండుపై నిక్కబొడుచుకున్నాయి.

ఒకరోజు మేమందరం లంచ్‌లో వుండగా

"ఏమిటో, మీసాలు పెంచమన్నారు. ఇవి చూడండి. అస్తవ్యస్తంగా ఎలా పెరుగుతున్నాయో" అన్నాడు అర్జునరావు.

అప్పుడు మాలో ఒకాయన "అర్జునరావుగారూ మీరేమీ గాబరా పడకుండా, ఇంకొన్ని రోజులు పెరగనిచ్చి ఇంటి దగ్గర ఆముదం రాసి, చిన్న దువ్వెనతో రెండు పక్కలకు దువ్వండి. అప్పుడప్పుడు చేతివేళ్ళతో అటూ ఇటూ మీసాలు సవరించుకుంటూ వుండండి" అన్నాడు.

మర్నాటినుంచి ఆయన మీసాలు అటూఇటూ అణిగి ఆయన ముఖానికి ఎంతో అందాన్నిస్తున్నాయి. ఇక పోతే ఆయన రెండు చేతుల్లో ఏదోఒక చెయ్యిమాత్రం మీసాలపై నాట్యం చేస్తోంది. అస్తవ్యస్తంగా పెరిగిన ఆయన మీసాలు, చేతివేళ్ళతో దువ్వుతుంటే ఇప్పుడిప్పుడే ఒక దారికి వచ్చి గుబురుగా తయారవుతున్నాయి.

అర్జునరావు మీసాలు దువ్వుతున్నాడు.

ఇంటిదగ్గరనుంచి టెలిగ్రాం వచ్చింది అర్జెంటుగా రమ్మని. శెలవుచీటీతోపాటు, టెలిగ్రాం తీసుకుని ఆఫీసరు గారి గదిలోకి వెళ్ళాడాయన.

"సర్"

"ఏమిటి?"

"ఇంటికి—శెలవు"

"ఇంటికి శెలవు ఏమిటయ్యా సరిగ్గా చెప్పు"

"ఇంటిదగ్గరనుంచి నన్ను రమ్మని టెలిగ్రాం వచ్చిందండి"

"అయితే ఎన్నిసార్లు శెలవు పెడతావ్? ఇప్పటివరకూ చచ్చిపోయినవాళ్ళందర్ని, మళ్ళీ మళ్ళీ చంపి ఎన్నోసార్లు శెలవు పెట్టి వెళ్ళావ్ అయ్ కెనాట్ శాంక్షన్ ది లీవ్"

"ఈ ఒక్కసారి—"

"నో—యూ కెన్ గో ఇన్ ది ఎన్సూయింగ్ హాలీడేస్" అని ఆయన అర్జునరావు ముఖంవేపు చూశారు. అర్జునరావు చెయ్యి విడిచి, మరో చేత్తో అవిశ్రాంతంగా మీసాలు దువ్వుతున్నాడు.

"ఏమిటి వేడు నన్ను బెదిస్తున్నాడా? లీవ్ శాంక్షన్ చేయకపోతే నీ అంతాం చూస్తానంటున్నట్లుగా మీసాలు దువ్వుతున్నాడా" ఆయనకు అనుమానం వచ్చింది.

"అర్జునరావ్ యూ కెన్ గో" అన్నారాయన జనరల్‌గా ఆఫీసరుగారు ముందు 'నో' అన్నాసరే తరువాత యస్' అంటారు. అందుకని అర్జునరావ్ మీసాలు



దువ్వుకుంటూనే నిలబడ్డాడు. ఆ "మీసాల దువ్వడు చూస్తుంటే ఆఫీసరుగారికి మండిపోతోంది.

కాలింగ్‌బెల్ నొక్కాడు. అటెండర్ వచ్చాడు

"ఇతన్ని బయటకు పంపించు. లీవ్ శాంక్షన్ చెయ్యమంటే మీసాలు దువ్వుతున్నాడు! ఎస్టాబ్లిష్ క్లర్క్‌ని పిలుచుకురా. ఇతని విషయం మాట్లాడతాను. అయ్ హేవ్ టు టేక్ డిసిప్లినరీ యాక్షన్" ఆయన గర్జించారు. ఆ దెబ్బతో అర్జునరావు వేలాడుతున్న ముఖంతో బయటకు వచ్చాడు.

సంగతి తెలిసి మేమందరం మూకుమ్మడిగా వెళ్లి ఆఫీసరుగారికి అసలు సంగతి చెప్పి, మీసాలు క్రొత్తగా పెంచడంవలన ఇలా జరిగిందని చెప్పాము.

ఈ సంగతి జరిగాక అర్జునరావు మీసాలు తీసేస్తానన్నాడు "మీసాలు కుదురుగా పెరిగాక మీసాలపైన చెయ్యి వేసే పనేముంది" అని నచ్చచెప్పాము. అర్జునరావు ఊరు వెళ్ళాడు.

ఆయన లేక మాకు ఆఫీసులో చిన్నబోయింది. ఎందుకంటే ఆయన 'మీసాల పెంపు' వలన ఎదుర్కొనే అనుభవాలు చెప్తుండేవాడు.

నాలుగురోజులు తరువాత అర్జునరావు ఊరినుండి వచ్చాడు, ఆయన్ని చూసి మేము, ఆశ్చర్యం, ఆందోళన చెందాము.

కారణం—

ఆయన తలకు కట్టు, కాళ్ళకు చేతులకు కట్లు నడవలేని స్థితిలో వచ్చాడు రిక్షాలో. శెలవు పొడిగిస్తే ఆఫీసరు గారు కేకలేస్తారని అలాగే వచ్చేశాడట.

"ఏం జరిగిందండీ" అన్నాము అందరం ఒకేసారి.

"ఏం జరగడమేమిటండీ బాబూ ఈ మీసాలు నా కొంప ముంచాయి" అన్నాడు.

"ఏంలేదు మీరు గాబరా పడకండి. మీసాలు అలవాటైపోతే అదేమీ వుండదని" చెప్పాము.

అసలేం జరిగిందంటే—

వాళ్ళ ఊళ్లో పేరు మోసిన నలుగురు దాదాలు వున్నారు. ఆ రోజున వాళ్ళు తమ శత్రుబృందాన్ని చితకబాది తమకు ఆ ఊళ్లో తిరుగులేదనే ధీమాతో వస్తున్నారు. వాళ్ళకు ఎదురుగా అర్జునరావు నడుస్తున్నాడు.

వాళ్ళను గమనించలేదేమో, మనవాడు మామూలుగా 'మీసాలు దువ్వడు' మొదలుపెట్టాడు.

"ఏంటి బే. మమ్మల్ని చూసి మీసాలు దువ్వుతావా?" అని అందరూ మీదపడి షిఫ్ట్ వేసుకుని ఉతికేశారు.

"కాదండీ నేను మీసాలు పెం—" అనే అర్జునరావు మాటలు నోట్లోనే వుండిపోయాయి.

"ఇక మీసాలు తీసేస్తానండీ. ఇవెప్పుడో నా ప్రాణాలు బలిగొంటాయి" అన్నారాయన,

"ఛ. అలా బెదిరిపోకండి. మీసాలమీద చేతులేసేసి బలవంతంగా చేతులు బిగపట్టుకుని వుండండి" అని సలహా చెప్పాము.

ఇలా రోజులు గడుస్తున్నాయి.

ఇంతలో, మా ఊళ్లో కుస్తీపోటీలు వచ్చాయి కుస్తీ పోటీ అంటే మా అందరికీ బలే ఇష్టం

దేశ ప్రఖ్యాతి గాంచిన ఇద్దరు మల్లయోధులు గోదాంలో వున్నారు. ఒకరిపైన ఒకరు సవాల్ చేసుకుంటూ, తొడలు చరుచుకుంటూ కాసుకో, కాసుకో అని అరుచుకుంటున్నారు.

అదే సమయంలో మేము వెళ్లి ముందు వరుసలో కూర్చున్నాము.

కుస్తీపోటీ మొదలైంది.

చాలాసేపు ఒకరినొకరు పట్టుపట్టడం విడిపించుకోవడం జరిగింది. ఒక వస్తాదు మరో వస్తాదుని రెండుసార్లు క్రింద పడేస్తే ఇంతే సంగతులు. వోడిపోయినట్లే. మూడో రౌండ్ చాలా ఉద్రేకంగా జరిగింది. మూడోసారి వస్తాదుని క్రింద పడేశాడు. ఒక వస్తాదు గెలిచాడు. కాసేప్పటి వరకు బోర్లాపడినవాడు లేవలేదు. లేచినా బాగుండేది.

# "శ్రీవాణి" జీవిత సభ్యులు


రెబ్బాప్రగడ వెంకటరాజేశ్వరరావు
అడ్వకేట్, కొవ్వూరు, ప. గో. జిల్లా


పెయ్యేటి వెంకటరావు, ఎడ్వకేట్
విజయవాడ


జంగాల వెంకటేశ్వరరావు
మచిలీపట్నం


వడ్డి మురళీధరరావు
లక్ష్మీఫాన్సీస్టోర్సు, బందరు


ఇంటూరి విజయరామారావు
జగ్గయ్యపేట


టి.వి.యస్. కళాధరరావు మేనేజర్,
ఆంధ్రాబ్యాంక్, జగ్గయ్యపేట


అక్కినేని కృష్ణారావు, నూజివీడు


ఐతరాజు రామారావు, వల్లభి, ఖమ్మంజిల్లా

# కలసివుంటే కలదు సుఖం!

కలసి వుంటే కలదుసుఖమని, ఐకమత్యమే బలమని చిన్నతనం నుండి ఏన్నో నీతికథలు విన్నాం, చదువు కున్నాం.

గ్రామీణ చెడుగుడు నుండిఅంతర్జాతీయ హాకీ, క్రికెట్ వరకుగల ఆటలలోజట్టులోని ఐకమత్యమే, జట్టునువిజయ పథం వైపు తీసుకువెడుతుందనేది సర్వవిదితం.

అయితే ఇంతచిన్న వాస్తవం, ఇంత సాధారణ నియమం, గత మూడున్నర దశాబ్దాలుగా భారతరాజకీయరంగంలో కాకలు తీరిన మన జాతీయనాయకులనబడేవారికి తెలియక పోవటం నిజంగా ఆశ్చర్యకరం!

## చేమమాత్ర వ్యాఖ్యాత

ఈనిజం మన నాయకులకు తెలియదనటం నిజంకాదు. వారికి తెలుసు. 1977లో ప్రజలు వారికి ఐకమత్యం వలన కలిగే లాభాలను, 1980లో కుమ్ములాటల వలన కలిగే నష్టాలను రుచిచూపించారు.

కాని ఏం లాభం? మన ప్రతిపక్షాల నాయకులందరూ, తాము కూయకపోతే తెల్లవారదనే కోడిపుంజుల చందంగానే వ్యవహరించారు. 1980 ఎన్నికలలో శ్రీమతిగాంధీ చేతుల్లో ఘోరంగా, చిత్తుచిత్తు కావింపబడి కూడా, లోకసభలో ఒక ఫ్రంటుగా ఏర్పడ లేకపోయారు. సమైక్య నాయకుణ్ణి ఎన్నుకోలేక పోయారు. అంతేకాదు శ్రీమతిగాంధీ హత్య దరిమిలా దేశవ్యాప్తంగా ఝంఝామారుతంలా ముంచు కొస్తున్న సానుభూతి పవనాల అంచనా కట్టలేక పోయారు. కనీసం ఇందిరాకాంగ్రెసు అభ్యర్థులతో పోటీ సమైక్య అభ్యర్థిని నిలబెట్ట లేకపోయారు!

ఫలితం——

ప్రక్క పేజీ తరువాయి

గెలిచిన మల్లయోధుడు గోదాంచుట్టూ కట్టిన తాడు పట్టుకుని చుట్టూ ప్రదక్షిణం చేస్తూ

"రండి ఎవరైనా వుంటే వీడిని వోడించలేనని ఈ ఊళ్ళో పందెం కట్టారుట. బస్తీమే సవాల్" అని అరుస్తున్నాడు.

నిజం చెప్పొద్దూ ఆ గెలిచిన వస్తాదు మీసాలు బొద్దింక మీసాలు బహు ముచ్చటగా వున్నాయి.

అర్జునరావుకు తనమీసాలు గుర్తుకు వచ్చినట్లున్నాయి. ఒక్కసారి తన మీసాలపై చెయ్యివేశాడు.

అంతే! ఇంకేముంది? గెలిచిన వస్తాదు తాడుమీద నుంచి ఒక్క దూకు దూకి తిన్నగా అర్జునరావు దగ్గరకు వచ్చి అతన్ని ఒకేసారి బియ్యం బస్తాలా పైకి ఎత్తి గోదాలోకి తీసుకెళ్ళి క్రింద పడేశాడు.

"ఏరా నాతో మీసం దువ్వుతావా ?" అని అరుస్తుంటే అర్జునరావు లేవటంలేదు.

మేమందరం లేచి వస్తాదుని శాంతింపచేసి అర్జునరావు దగ్గరకు వెళ్ళిచూస్తే ఏముంది! స్పృహలోలేడు అర్జునరావు వెంటనే అతన్ని హాస్పటల్‌కి తరలించాము.

తరువాత అర్జునరావు తిరుపతి మొక్కుబడి మూలాన్న తలపైన, మీసాలగ్రౌండ్‌లోనూ ఒక్కవెంట్రుక లేకుండా చేసేసుకున్నాడు.

— సమాప్తం —

తామే భువికధికారులమనీ, తామే ఈజాతికి నాయకత్వం నెరపగలమని విఱ్ఱవీగిన మహానాయకులు చంద్రశేఖర్, వాజపేయి, ఫెర్నాండెజ్, బహుగుణ' రామ్‌జేత్మ్‌లానీ, దేవీలాల్ కనీసం తాము లోకసభలో అడుగుపెట్టే అర్హతను కూడా పొందలేకపోయారు.

చరణసింగ్, జగజ్జీవన్‌రామ్, మధుదండావతే వంటివారు సైన్యం లేని సేనానులుగా మిగిలిపోయారు.

అంతేకాదు226 స్థానాలకు పోటీచేసిన భారతీయ జనతా పార్టీ కేవలం రెండుసీట్లను మాత్రమే గెలుచుకుని, 97 స్థానాలలో డిపాజిట్లు కోల్పోయింది. జనతాపార్టీ 207 సీట్లకు పోటీచేసి 9 చోట్ల మాత్రమే పరువు దక్కించుకొనగా 105 చోట్ల డిపాజిట్లు పోగొట్టుకుంది. ఇక డి. యమ్. కె. పి. పార్టీ 168 సీట్లకు పోటీచేసి 3 మాత్రమే గెలుచుకుని, సగంపైగా డిపాజిట్లు కోల్పోయి చతికిలబడింది. ఇహ కమ్యూనిస్టుల సంగతి సరేసరి.

ఇంత జరిగినా మన 'జాతీయ'నాయకులకుజ్ఞానోదయం కలిగిందా? కలుగుతుందా?

కొన్ని రాష్ట్రాల శాసనసభలకు జరుగనున్న ఎన్నికల సందర్భంగానైనా వీరు విజ్ఞతను ప్రదర్శిస్తారా!

వేచిచూడవలసిందే!

## ఇంటగెలిచి రచ్చగెలవాలి!

ఇంట గెలిచి రచ్చ గెలవమన్నారు బ్రదర్. "మేము గుడివాడ నుండే పోటీ చేస్తాము"

1983 అసెంబ్లీ ఎన్నికలకు ముందు యన్. టి. ఆర్. ఎక్కడి నుండి పోటీ చేస్తారన్న పత్రికా విలేఖరుల ప్రశ్నకు యన్. టి. ఆర్ ఇచ్చిన సమాధానమిది.

పై ఎన్నికలలోమాత్రం యన్.టి ఆర్ గుడివాడనుంచి విజయంసాధించారు.అయితే తదుపరిఆనియోజకవర్గంలోని సమస్యల పరిష్కారానికి, ముఖ్యమంత్రిగాను, ఆ నియోజకవర్గపు తెలుగుదేశపు పార్టీ పటిష్టతకు పార్టీ అధ్యక్షుడుగానూ ఆయన చేసినకృషిగాని, సాధించినదిగాని చాలా తక్కువ. ఆయన స్వంత నియోజకవర్గంలోనూ వున్నంత బలహీనంగా పార్టీగాని, పార్టీలోని ముఠాతగాదాలుగాని రాష్ట్రంలో తెలుగుదేశం చేతుల్లో వున్న ఏ నియోజకవర్గంలోనూ లేవని చెప్పటం అతి శయోక్తి గాదు.

1983 జనవరి అసెంబ్లీ ఎన్నికలలో 25 వేల పైగా మెజారిటీతో గుడివాడలో తెలుగుదేశం అభ్యర్థిగా ఆయన అఖండ విజయం సాధించగా 1984 డిసెంబరులో జరిగిన లోక సభఎన్నికలలో గుడివాడలో తెలుగుదేశం అభ్యర్థికి ఇందిరా కాంగ్రెసు అభ్యర్థికన్న 4 వేల వోట్లు తక్కువ వచ్చాయి. ఏతావాత తేలిందేమంటే ముఖ్యమంత్రి తన స్వంత నియోజకవర్గంలో దాదాపు 30 వేలమంది ఓటర్ల అభిమానాన్ని కోల్పోయారన్నమాట!

'అన్నగారు' ఇకనైనా ఇంట గెలిచే ప్రయత్నం చేస్తారేమో చూడాలి!!!

## పై

ప్రేయసి పదవి
ప్రియుడు నాయకుడు
ఎడబాటు సహించలేకనే
ఎన్నికల పెళ్ళి పందిట్లో
అయిదేళ్ళ రిజిష్టరు మారేజి
అందుకు సాక్షులు ప్రజలు
తలంబ్రాలు ఓట్లు
తాంబూలు పంచిన నోట్లు

జి. సనారా, విజయనగరం

"చెముడుకు మందివ్వబడును" - డా॥ శ్రవణానంద బోర్డు చూసి లోపలి కెళ్ళాడు గుర్నాధం.

"సార్! నా కుడి చెవి వినబట్టం లేదు'కాస్త పరీక్ష చేయండి". అడిగాడు గుర్నాధం.

"భార్య కన్పించ కుంటే ఇక్కడ కొచ్చి చెప్తారటయ్యా! పోలీస్ స్టేషన్‌లో రిపోర్టివ్వు! పో!!విసుక్కున్నాడు డాక్టర్.

— షేక్ ఖాసీంపీరా

# అభిప్రాయవేదిక

ఆరాధ్య దేవత

నా రాధ్య దేవత సరస్వతీ దేవియే నాకు ధైర్యము చెప్పుట. "శ్రీవాణి" గా అవతరించినదని మీ పత్రిక చూడగనే స్ఫురించినది. అందుచేత మీ "శ్రీవాణి" కి Lifeiember గా జేరదలచుకొని రు 500/= పంపు తున్నాను.

— తెబ్బాప్రగడ వెంకట రాజేశ్వరరావు, ఎడ్వకేట్
కొవ్వూరు. ప గో. జిల్లా

గురు దేవులు

'శ్రీవాణి" ప్రారంభ సంచికను నేను కొని చదివితిని పూజ్యులు, కీ. శే. మా గురుదేవులు ముట్నూరి. పట్టాభి గారల వ్యాసములు చదివితిని తమకు నాహృదయ పూర్వకఅభివందనములు. అశనిపాత రాజకీయాలు చదివితి. మరికొంత వివరంగా వుంటే యింకా బాగుండేది. నా సంవత్సర చందా పంపు తున్నాను. రాజ పోషకుం, పోషకుల వివరాలు పంపుతే నా శాయశక్తులా కృషి చేస్తాను. 'శ్రీవాణి' పత్రిక పది కాలాల పాటు చక్కగానడవాలని నా ఆకాంక్ష.

—కె.పి యస్. రాజు. ప్రసిడెంట్
ప.గో. జిల్లా స్వాతంత్ర్య సమర యోధుల సంఘం.
పాలమూరు.

ప్రశ్నలు:

ప్రశ్నలు—సమాధానాల శీర్షిక ప్రతిమాసం వుండాలని నా కోరిక.

—షేక్ ఖాశింపీరా, కనిగిరి

పెద్దపేరు:

అతి తక్కువ కాలంలో అతిపెద్ద పేరు తెచ్చుకున్న పత్రిక "శ్రీవాణి"

—పూజారి నరసింహా రావు
పర్లాకిమిడి (ఒరిస్సా)

భారతి:

ప్రసిద్ధ సాంస్కృతిక మాస పత్రిక 'భారతి' తీరు తెన్నులు మీ పత్రిక 'శ్రీవాణి' లో గోచరించాయి.

—కే. బి. కృష్ణ, నాగార్జున సాగర్

యవనిక:

'యవనిక' సీరియల్, కవితలు బాగున్నాయి. యోగ విద్య శీర్షిక కోసం ఎదురు చూస్తున్నాను,

—వి. చక్రధర్ — కనిగిరి.

బాధకలిగిస్తుంది

మీ తొలిసంచిక సంపాదకీయం మే ధా వి వ ర్గా ని కి బాధ కలిగిస్తుంది. ఒక సాంస్కృతిక పత్రికలో ఇటు వంటి తరహా సంపాదకీయమా? సంపాదకీయాలలో మరల రాజకీయంచోటుచేసుకుంటే ప్రతిపక్షాలకు ముందుగా కొన్ని సంహాలు యివ్వండి. ఒక పార్టీని పొగడుతూ, వేరొక పార్టీని తెగడుతూ వ్రాయటం ఏమాత్రం భావ్యంకాదు. తక్కిన శీర్షికలు నాకెంతో నచ్చాయి. సాంస్కృతిక మాసపత్రికను నడుపుటలో మీరుచేయబోతున్న సాహసం నిజంగా శ్లాఘింపదగ్గది. ఈ రోజులలో ఇలాంటి పత్రికను ఆదరించే పాఠకులు ఎంతశాతం? ఎంతవరకు ఆదరిస్తారు? అన్నది మీకు ఎదురయ్యే మొట్టమొదటి సమస్య. అయినా ఒక సాహిత్యాభిలాషిగా మీకు శ్రేయోభిలాషిని. ఆ వాగ్దేవి మీకు తోడునీడ. కొనసాగించండి.

పి. బి. వి. రాజు, కొవ్వాడ, విశాఖజిల్లా.

హిమగిరిశిఖరం

ప్రారంభసంచిక హిమగిరి శిఖరమంత మహోన్నతంగా నున్నది. సరస్వతీదేవిముఖచిత్రం పత్రికపేరు, ప్రారం సంచిక ఔన్నత్యాన్ని మరింతగా యినుమడింపజేసింది. ప్రాచీన సాహితీ సుమసౌరభం, ఆధునిక సాహితీ అంద చందాలు శ్రీవాణిలో పోటీపడుతున్నాయి.

—జె. యస్ సి. సాయిబాబు, భట్టిప్రోలు

ఆకర్షణ:

'శ్రీవాణి' ముఖ చిత్రం ఆకర్షణగా లేదు. ఆధ్యాత్మిక పాలు ఎక్కువగా వున్నది. 'యవనిక' సీరియల్' మాత్రం బాగున్నది సినీవాణి ప్రచురిస్తే బాగుంటుంది. మిమ్మల్ని విమర్శించాలని కాదు; ఒక మంచి పత్రికగా రూపు దిద్దుతారని ఆశిస్తున్నాను.

—వి. ప్రభాకర్. మాన్వి
(కర్ణాటక)

# సమాధానం వ్రాయండి - బహుమతులు పొందండి

1. డెబిటెంట్‌గా 19వ నెంబరుగా వచ్చి సెంచరీ చేసిన బ్యాట్సుమన్ ఎవరు? ఏ దేశీయుడు?
2. సిటీ ఆఫ్ సెవెన్‌హిల్స్ అని ఏ పట్టణమునకు పేరు?
3. తెలుగు జైమినీభారతం కర్త ఎవరు?
4. 1935లో తీవ్ర భూకంపానికి గురియైన దేశపురాజధాని ఏది?
5. కామన్‌వెల్త్ దినము ప్రతిసంవత్సరం జరుపబడు మాసము, వారము ఏది?
6. ఆంధ్రపితామహుడు ఎవరు?
7. కంప్యూటర్‌ను కనుగొనినదెవరు?
8. బాల్టిక్ సముద్రమును, ఉత్తరసముద్రముతో కలిపే కాలువ పేరు?
9. విటమిన్ 'డి' లోపంవలన కలిగే వ్యాధి ఏది?
10. ఆదివారమునకు మరొక తెలుగుపేరు?

### గతసంచిక సమాధానాలు :

1. గురుగోవిందవల్లభుడు (గోవిందభగవత్పాదాచార్యులు) 2. OTTO HAHN
3. శామ్యూల్‌కోల్ట్ 4. 18-7-1980 శ్రీహరికోటనుండి 5. తోరుదత్ (బెంగాలి)
6. డమరుకం 7. ఆశాపూర్ణాదేవి 8. ఊసరవెల్లి 9. సింహపురి
10. సమర్థరామదాసు భవాని

### గతసంచిక విజేతలు

1. సి. హెచ్. మధుసూధనరావు, కడూరు 2. వై. నీలిమ, మోపిదేవి
3. షేక్ ఖాసీంపీరా, కనిగిరి 4. కె. జి. ఎల్. శ్యామల, కైకలూరు
4. ఎన్. కె. వి. సుబ్రహ్మణ్యం, పిల్లపట్నం

గమనిక ; చాలామంది పాఠకులు సరైన సమాధానాలు వ్రాసారు. పై ఐదుగురు లాటరీ విజేతలు. వీరికి 'రామాయణ పాత్రలు' పుస్తకము బుక్-పోస్టులో పంపబడును. రాబోవు విజేతలకుకూడా ఈ విధమైన పద్ధతిద్వారానే 5 గురికి బహుమతులు పంపబడును. సమాధానాలతోపాటు ఈ క్రింది కూపన్ మీద చిరునామా వ్రాసి జతపరచవలెను

"శ్రీవాణి" కూపను

పేరు... ... ... ... ... ...

చిరునామా ... ... ... ... ...

... ... ... ... ...

# ఉత్తమ బాల సాహిత్యం

## త్వరపడండి! ఒకసెట్టుకొంటే యివ్వబడును. కాపీలు కొద్దిగా ఉన్నవి.

**బాలవిజ్ఞానకోశము:** రచన, సంకలనం: 'కొమరగిరి'

1/8 డెమ్మీ. పే.288 వెల రు 12.00 కవరుపేజీ చక్కటి ద్వివర్ణ చిత్రం

ఇది పెద్దబాలశిక్ష లాంటి అత్యున్నతమైన గ్రంథం (ENCYCLOPAEDIA)

DIRECTOR OF PUBLIC LIBRARIE'S CITATION NO 4444/39

**వివేకవాణి:** రచన: 'కొమరగిరి'

1/8 డెమ్మీ: పే.184 కవరుపేజీ: చక్కటి త్రివర్ణ చిత్రం

ఈ పుస్తకమును పండిత నెహ్రూగారి GLIMPSES OF WORLD HISTORY కి తుల్యమైనదని పత్రికలు ప్రశంసించాయి.

DIRECTOR OF PUBLIC LIBRARIE'S CITATION NO 2123/తె3oc 104

**రామాయణ పాత్రలు:** రచన: 'కొమరగిరి'

1/8 డెమ్మీ. పే 88. కవరుపేజీ: చక్కటి త్రివర్ణ చిత్రం

ఈ పుస్తకము చదివినవారికి రామాయణము మొత్తం చదవాలనే ఆసక్తి కలుగుతుందని పత్రికలు ప్రశంసించాయి.

DIRECTOR OF PUBLIC LIBRARIES CITATION. NO.3523/346

**గాంధీ-లోహియా-దీనదయాళ్** దీనదయాళ్ పరిశోధనా సంస్థవారి ముద్రిత ఇంగ్లీషు మూలానికి అనువాదం: శ్రీ కందర్ప 1/8 డెమ్మీ. పే.160. చక్కని ద్వివర్ణముఖచిత్రం

సమసమాజ నిర్మాణానికి ఈ పుస్తకం సరికొత్త ఆలోచనలను రేకెత్తిస్తుందని పత్రికలు ప్రశంసించాయి

DIRECTOR OF PUBLIC LIBRARIE'S CITATION. NO 6414/3900/427

ముఖ్యగమనిక- 1. నాల్గు పుస్తకములు తీసుకొనేవారు రు 34.00 M.O. ద్వారా పంపవలెను. POSTAGE (REG-BookPost) ఛార్జీలు రు. 4.20 ఉచితం

2. 5 సెట్లు తీసుకొనేవారికి 30% DISCOUNT మినహాయించుకొని M.O పంపవచ్చును. POSTAGE ఉచితం. VPPలు అంగీకరించబడవు.

3. ముందుగా డబ్బు పంపినవారికే పుస్తకములు పంపబడును.

---

ప్రతులకు. **జయప్రద పబ్లికేషన్స్**

24-51 రామానాయుడుపేట. మచిలీపట్నం-521001